ఇది ఐదో పాఠం.
idi aidoo paaTham. — This is the fifth lesson.

ఈ పాఠం ఎన్నోది ?
ii paaTham ennoodi ? — Which one is this lesson ?

ఈ పాఠం ఐదోది.
ii paaTham aidoodi. — This lesson is the fifth one.

మంచివాడు
mancivaaDu 'good (male) person' (informal, inferior)

మంచివారు
mancivaaru 'good (male or female) person (formal, polite)

మంచివాళ్ళు
mancivaLLu 'good (male/female) persons (formal and informal)

మంచిది
mancidi 'good female person (very intimate, inferior) good thing.

మంచివి
mancivi 'good things'

Study the following forms on the analogy of the above.

కొత్తవాడు
kottavaaDu

కొత్తవారు
kottavaaru

కొత్తవాళ్ళు
kottavaaLLu

కొత్తది
kottadi

కొత్తవి
kottavi

చిన్నవాడు
cinnavaaDu

చిన్నవారు
cinnavaaru

చిన్నవాళ్ళు
cinnavaaLLu

చిన్నది
cinnadi

చిన్నవి
cinnavi

పాతవాడు
paatavaaDu

పాతవారు
paatavaaru

పాతవాళ్ళు
paatavaaLLu

పాతది
paatadi

పాతవి
paatavi

| | |
|---|---|
| పెద్దవాడు<br>peddavaaDu | పెద్దవారు<br>peddavaaru |
| | పెద్దవాళ్ళు<br>peddavaaLLu |
| పెద్దది<br>peddadi | పెద్దవి<br>peddavi |
| పొడుగాటివాడు<br>poDugaaTivaaDu | పొడుగాటివారు<br>poDugaaTivaaru |
| | పొడుగాటివాళ్ళు<br>poDugaaTivaaLLu |
| పొడుగాటిది<br>poDugaaTidi | పొడుగాటివి<br>poDugaaTivi |
| నల్లనివాడు<br>nallanivaaDu | నల్లనివారు<br>nallanivaaru |
| | నల్లనివాళ్ళు<br>nallanivaaLLu |
| నల్లనిది<br>nallanidi | నల్లనివి<br>nallanivi |
| ఎర్రనివాడు<br>erranivaaDu | ఎర్రనివారు<br>erranivaaru |
| | ఎర్రనివాళ్ళు<br>erranivaaLLu |
| ఎర్రనిది<br>erranidi | ఎర్రనివి<br>erranivi |
| ఐదోవాడు<br>aidoovaaDu | ఐదోవారు<br>aidoovaaru |
| ఐదోది<br>aidoodi | — |
| ఎన్నోవాడు<br>ennoovaaDu | ఎన్నోవారు<br>ennoovaaru |

ఎన్నోది

ennoodi

మంచివాడివి

mancivaaDivi 'you are a good male person (informal/ inferior),

మంచిదానివి

mancidaanivi 'you ar female person (infor

మంచివాడు

mancivaaDu 'he is a good male person (informal/ inferior',

మంచిది

mancidi 'she is a goc female person (infor inferior)'

మంచివారు

mancivaaru (you) he/she is a good person (polite) formal)

మంచివాళ్ళు

mancivaLLu (you) ,th are (male/female) gc persons.

మంచివాణ్ణి

macivaaNNi 'I am a good male person'

మంచిదాన్ని

mancidaanni 'I am a female person'

మంచివాళ్ళం

mancivaaLLam 'we (excl.incl. are g

బాబూ, నువ్వు చాలా మంచివాడివి. Boy, you are a very good

పాపా, నువ్వు చాలా మంచిదానివి. Baby, you are a very goo

ఆ అబ్బాయి చిన్నవాడు. That boy is a small one.

ఈ అమ్మాయి చిన్నది. This girl is a small one.

ఆమె అత్తగారు చెడ్డవారు కాదు. Her mother-in-law is no person.

వాడి స్నేహితులు చెడ్డవాళ్ళు కాదు. His friends are not bad pe

నేను కొత్తవాణ్ణి. I am a new (male) person.

నేను కొత్తదాన్ని. I am a new (female) pers

మేము తెలుగువాళ్ళం. We are Telugu people.

మనం భారతీయులం. We are Indians.

ప్రభుత్వం

prabhutvam 'government'

బర్రె/గేదె/ఎనుము

barre/geede/enumu 'bu

పళ్ళెం
paLLem 'metal plate'

గ్లాసు
glæsu 'tumbler'

డైరీ
Dairii 'diary'

కళ్ళజోడు
kaLLadzooDu 'eye-glasses'

చెప్పు
ceppu 'chappal'

బూటు
buuTu 'shoe'

పలక
palaka 'slate'

పెన్సిలు
pensilu 'pencil'

పొలం
polam 'cultivating field'

బీద/పేద
'poor'

మొన్న
monna 'day before yesterday'

అందరం
andaram 'all of us'

నిన్న
ninna 'yesterday'

ఈరోజు/ఈవేళ/ఇవాళ
iiroodzu/iiwæLa/iwaaLa 'today'

రేపు
reepu 'tomorrow'

టైరు
Tairu 'tyre'

చక్రం
cakram 'wheel'

చప్పుడు
tsappuDu 'sound'

పండు
paNDu 'fruit'

భవనం
bhavanam 'building'

జీపు
jiipu 'jeep'

మూత
muuta 'lid/cap'

ఎర్ర
erra 'red'

బావి/నుయ్యి
baavi/nuyyi 'well'

గొప్ప
goppa 'great/rich'

తెలుగువాళ్ళు
teluguvaaLLu 'Telugu people'

భారతీయులు
bhaaratiiyulu 'Indians'

ఉద్యోగి
udyoogi 'employee'

ఎల్లుండి
elluNDi 'day after tomorrow'

తేదీ/తారీఖు
teedii/taariikhu 'date'

# LESSON 7

– కు/కి* 'to; for'

కావాలి 'is/are wanted'

అక్కర్లేదు/వద్దు 'not wanted/not needed'

కూడా 'also'

అన్నీ 'all things'

ఏమీ 'anything' (used in the negative sense)

అయితే 'in that case/so/but'

చాలు 'is/are enough'

తప్పకుండా 'without fail/certainly'

సరే 'alright'

అలాగే 'let it be so, that way, alright,

ఇంకా 'still, yet'

మాత్రం 'only'

| | |
|---|---|
| నాకు తెలుగు పుస్తకం కావాలి. | I want a Telugu book. |
| మీకు ఏం కావాలి ? | What do you want ? |
| నాకు తెల్లకాయితం కావాలి. | I want a white paper, |

---

*The Dative case suffix *-ku/ki* is added to an oblique form. Thus, *naa+ku=naaku, atani+ki=ataniki, deeSaani+ki=deeSaaniki, vaaLLa+ku=vaaLLak,upillala+ku=pillalaku* etc. *i* ending forms take *-ki* and the rest take *-ku* in the dative case. However a tendency to add *- ki* to the *-e* ending and *-a* ending forms also prevails. Forms like *aayana* and *aame* do not undergo change in their shape before the dative suffix.

Normally an oblique form ends in *-i* in the singular and *-a* in the plural (e.g., *atani* 'his,' *pillala* 'children's').

| | |
|---|---|
| మల్లయ్యకు ఏం కావాలి ? | What does Mallayya want ? |
| అతనికి ఉద్యోగం కావాలి. | He wants a job. |
| మీకు కాఫీ కావాలా ? | Do you want coffee ? |
| వద్దు. మంచినీళ్ళు చాలు. | No [not wanted]. Water [drinking water] is enough. |
| ఏమండీ, మీకు కూడా కాఫీ వద్దా ? | Hello, you too do not want coffee ? |
| వద్దండి. చాలా థాంక్స్ ! | No please, Many thanks ! |
| అయితే, పలహారం కావాలా, వద్దా ? | So, do you want tiffin or not ? |
| పలహారం తప్పకుండా కావాలి. | Tiffin is certainly wanted. |
| కల్యాణికి ఉద్యోగం అక్కర్లేదు. | Kalyani does not want a job. |
| ఆమెకు డబ్బు కావాలా, అక్కర్లేదా ? | Does she want money or not ? |
| ఆమెకు ఏమీ అక్కర్లేదు. పెళ్ళి కావాలి. | She does not want anything, She wants to get married [She wants marriage]. |
| పెళ్ళికి మాత్రం డబ్బు అక్కర్లేదా ? | Isn't money required even for marriage ? |
| దానికి కూడా డబ్బు కావాలి. | Money is required also for that. |

| | |
|---|---|
| తెలుసు is [are] known' | తెలియదు 'is not known' |
| ఎక్కువ 'more' | తక్కువ 'less' |
| రెండూ both' | పరిచయం 'introduction/acquaintance' |

కొంచెం 'a little'

| | |
|---|---|
| నాకు హిందీ తెలుసు. | I know Hindi. |
| నాకు బెంగాలీ తెలియదు. | I do not know Bengali. |

| | |
|---|---|
| మీకు పంజాబీ తెలుసా ? | Do you know Punjabi ? |
| నాకు పంజాబీ తెలియదు; మరాఠీ తెలుసు. | I do not know Punjabi; I know Marathi. |
| ఆమెకు ఏం తెలుసు ? | What does she know ? |
| ఆమెకు తమిళం తెలుసు. | She knows Tamil. |
| మీకు ఉర్దూ తెలియదా ? | Don't you know Urdu ? |
| ఉర్దూ తెలియదండి; తెలుగే తెలుసు. | I do not know Urdu; I know only Telugu. |
| మీకు హిందీ తెలుసు కదా ! | You know Hindi ; don't you ? |
| కొంచెం తెలుసు. | I know a little. |
| శారదకు ఇంగ్లీషు తెలియదా ? | Does n't Sarada know English ? |
| ఎక్కువ తెలియదు; కొంచెం తెలుసు. | She does not know much ; she knows a little. |
| అతనికి సంస్కృతం తెలుసా, తెలుగు తెలుసా ? | Does he know Sanskrit or Telugu ? |
| రెండూ తెలుసు. సంస్కృతం ఎక్కువ తెలుసు, తెలుగు తక్కువ తెలుసు. | He knows both. He knows more of Sanskrit and less of Telugu. |
| నాకు రామారావు తెలుసు. | I know Ramarao. |
| మీకు గోపాలకృష్ణగారు తెలుసా ? | Do you know Mr. Gopalakrishna ? |
| ఎక్కువ తెలియదు. పరిచయం తక్కువ. | Not well. My acquaintance [with him] is a little. |
| మీకు మాలతి తెలియదా ? | Don't you know Malati ? |
| తెలుసు. మన శేషాద్రిగారి అమ్మాయి కదూ ? | I know. She is our Seshadri's daughter; isn't she ? |
| ఔను. వాళ్ళ చెల్లెలి పేరు తెలుసా ? | Yes, Do you know her sister's name ? |
| తెలియదు. ఏమిటి ? | I don't know. What is it ? |

| | |
|---|---|
| ఉమ. | Uma. |
| ఔనౌను ! మంచి నర్తకి కదూ ? | 'Yes, yes ! She is a good dancer; isn't she ? |
| ఔను. ఆ అమ్మాయికి పెళ్ళి. | Yes. She is going to be married. |
| అలాగా ! | Is it so ? |
| మీకు తెలియదా ? రేపు రాత్రి ఎనిమిది గంటలకు. | Don't you know ? Tomorrow night at eight o' clock. |
| బాగుంది. చాలా సంతోషం ! | That's fine. I am very glad. |

| | |
|---|---|
| వచ్చు is [are] known' [refers to the acquisition of some skill or knowledge] | రాదు 'is not known' |
| సంగీతం 'music' | నాట్యం 'dance' |
| బాగా 'well, nicely' | పోనీ 'otherwise' |
| పాట 'song' | పద్యం 'poem' |

| | |
|---|---|
| నాకు కన్నడం వచ్చు. | I know Kannada. |
| మీకు తమిళం వచ్చా ? | Do you know Tamil ? |
| నాకు తమిళం రాదు. | I do not know Tamil. |
| మీకు హిందీకూడా రాదా ? | Don't you know even Hindi ? |
| హిందీ మాత్రం కొంచెం కొంచెం వచ్చు; బాగా రాదు. | I know Hindi a little; I do not know it well. |
| మీ అమ్మాయికి నాట్యం వచ్చాండి ? | Does your daughter know dancing ? |
| నాట్యం రాదండి; సంగీతం వచ్చు. | She does not know dancing; she knows music. |
| అలాగా ! మా సీతకు నాట్యం వచ్చు. | Is it so ! Our Sita knows dancing. |
| కథాకళి వచ్చా, కూచిపూడి వచ్చా? | Does she know Kathakali or Kuchipudi ? |
| కథాకళిరాదు; కూచిపూడి నాట్యం బాగా వచ్చు. | She does not know Kathakali ; she knows Kuchipudi [dancing] well. |

# LESSON 8

ఇక్కడ 'here' | అక్కడ 'there'

ఎక్కడ 'where'

ఉంది/ఉన్నది 'it/she is' | ఉన్నాయి 'things are'

ఉన్నాడు '(he is'(intimate, inferior) | ఉన్నారు persons are; person (formal polite) is

లేదు 'it/she is not' | లేవు 'things are not'

లేడు 'he (intimate, inferior) is not' | లేరు 'persons are not ; person (formal' polite)' is not'

లో 'in' | లోపల 'within, inside'

మీద 'on' | పైన 'on the top of'

కింద 'under' | వెనక/వెనకాల 'behind'

మధ్య(లో) [in the] middle' | చివర '[at the] end [of]'

ముందర 'in front of' | పక్కన 'by the side of'

బీరువా 'almirah' | పెట్టె 'box/trunk

ఒడి 'lap' | మేడ 'upstair building'

ఎప్పుడు 'when' | ఎలా 'how'

ఇప్పుడు 'now'

అప్పుడు 'then'

పరవాలేదు 'No problem'

చుట్టూ around

అంతస్తు storey of a building

మూల [at the] corner,

వరండా 'verandah'

సగం 'half'

బోర్డు 'board'/'name plate'

దారి 'way'

ముందు 'before'

| | |
|---|---|
| ఇక్కడ బీరువా ఉంది. | Here is an almirah, |
| బీరువా గదిలో ఉంది. | Almirah is in the room, |
| బీరువా ఎక్కడ ఉంది ? | Where is the almirah ? |
| బీరువా గదిలో ఉంది. | Almirah is in the room. |
| బట్టలు ఎక్కడ ఉన్నాయి ? | where are the clothes ? |
| బట్టలు అక్కడ ఉన్నాయి. | Clothes are there. |
| అక్కడ ఏముంది ? | What is there ? |
| అక్కడ పెట్టె ఉంది. | There is a box. |
| పెట్టెలో ఏమున్నాయి ? | What are there in the box? |
| పెట్టెలో బట్టలున్నాయి. | There are clothes is the box, |
| పెట్టెలో తెల్లకాయితాలు లేవు. | There are no white papers in the box, |
| పెట్టెలో తెల్లకాయితాలు లేవా ? | Are there no white papers in the box ? |
| లేవు. తెల్లకాయితాలు బల్లమీద ఉన్నాయి. | No, White papers are on the table. |

| | |
|---|---|
| బల్లమీద కలం ఉందా ? | Is there a pen on the table ? |
| బల్లమీద కలంలేదు; పెన్సిలు ఉంది. | There is no pen on the table ; there is a pencil. |
| రంగు పెన్సిలు ఉందా, నల్లపెన్సిలు ఉందా ? | Is there a coloured pencil or a black pencil ? |
| రంగు పెన్సిలు లేదు; నల్లపెన్సిలే ఉంది. | There is no coloured pencil ; there is only a black pencil. |
| మీకు ఆ పెన్సిలు కావాలా ? | Do you want that pencil ? |
| అక్కర్లేదు. మీకు కావాలా ? | Not necessary. Do you want it ? |
| శారద ఊళ్ళో ఉంది. | Sarada is in the town, |
| డేవిడ్ ఊళ్ళో లేడు. | David is not in the town. |
| ఒళ్ళో పుస్తకాలున్నాయి. | There are books in the lap, |
| బళ్ళో పిల్లలున్నారు. | There are children in the school. |
| మీ తమ్ముడు ఊళ్ళో ఉన్నాడా ? | Is your younger brother in town ? |
| మా తమ్ముడు ఊళ్ళోలేడు; బొంబాయిలో ఉన్నాడు. | My younger brother is not in town ; he is in Bombay. |
| నీ ఒళ్ళో పువ్వులున్నాయా ? | Do you have flowers in your lap ? |
| నా ఒళ్ళో పువ్వులు లేవు; పుస్తకాలున్నాయి. | There are no flowers in my lap ; there are books. |
| పిల్లలు ఇంట్లో ఉన్నారా ? | Are the children in the house ? |
| ఇంట్లో లేరు; తోటలో ఉన్నారు. | They are not in the house; they are in the garden. |
| వెంకట్రావుగారు ఎక్కడున్నారు ? | Where is Mr. Venkatrao ? |
| వెంకట్రావుగారు మేడమీద ఉన్నారు. | Mr. Venkatrao is upstairs. |
| వారు ఉద్యోగంలో ఉన్నారా ? | Is he in service ? |
| లేరు. ఉద్యోగంలో లేరు. | No. He is not service. |

| | |
|---|---|
| మీ తాతగారు బాగున్నారా ? | Is your grand-father fine ? |
| ఆయన జబ్బులో ఉన్నారండి. | He is ill. |
| రంగయ్యగారు ఎలా ఉన్నారు ? | How is Mr. Rangayya ? |
| ఆయన కష్టాల్లో ఉన్నారు. | He is in the midst of difficulties. |
| రేడియోలో ఏం కార్యక్రమం ఉంది ? | What programme is there over the radio ? |
| బాలమురళీకృష్ణ సంగీత కచేరీ ఉంది. | There is a music recital of Balamurali krishna. |
| ఇప్పుడు విశ్వనాథంగారు ఊళ్ళో ఉన్నారా ? | Is Mr. Viswanatham in town now ? |
| లేరండి. | No Sir ! |
| కమలమ్మగారి ఒంట్లో ఎలా ఉంది ? | How is the health of (Mrs/Miss) Kamalamma ? |
| ఇప్పుడు బాగాఉంది. | It is alright now. |
| మీ ఆయన * ఇప్పుడు ఏ దేశంలో ఉన్నారు ? | In which country is your husband now ? |
| కెనడాలో ఉన్నారండి. | He is in Canada. |
| సుశీల ఇప్పుడు ఎక్కడుంది ? | Where is Susila ? |
| బెజవాడలో ఉందండి. | She is in Bezawada. |
| మా ఆవిడ కూడా అక్కడే ఉందిప్పుడు. | My wife is also there at present. |
| అలాగా ! | Is it so ! |
| మీ అమ్మగారు పనిలో ఉన్నారా ? | Is your mother engaged in work ? |
| లేదండి. పూజలో ఉంది. | No sir (madam). She is engaged in worship. |
| నా ఫైలు ఎక్కడుంది ? | Where is my file ? |
| అక్కడ బల్లమీదుంది. | It is there on the table. |
| ఇక్కడ ఇదేమిటి ? | What is this here ? |

---

**mi aa yana* means your husband. It is never used as *nii aayana*.

| | |
|---|---|
| ఇది శాంతమ్మగారి ఫైలు | This is (Mrs.) Santamma's file. |
| నా గది మేడ మీద ఉంది. | My room is upstairs. |
| అది రెండో అంతస్తులో ఉంది. | It is in the second storey. |
| వరండాకు చివర ఉంది. | It is at the end of the verandah. |
| గది ముందు బోర్డు ఉంది. | There is a board in front of the room. |
| నా బల్ల గది మధ్య(లో) ఉంది. | My table is in the middle of the room. |
| బల్లచుట్టూ నాలుగు కుర్చీలున్నాయి. | There are four chairs around the table. |
| నా కుర్చీముందు రెండు బీరువా లున్నాయి. | There are two almirahs in front of my chair. |
| కుర్చీ పక్కన చెత్తకాయితాల బుట్ట ఉంది. | There is a waste paper basket by the side of my chair, |
| బల్లకింద చిన్నపీట ఉంది. | There is small wooden plank under the table. |
| గదిలో ఒక మూల పంకా ఉంది. | There is a fan in a corner of the room |
| నా గదిలో రెండు కిటికీలున్నాయి. | There are two windows for my room. |
| నా కుర్చీ వెనకాల ఏమీ లేవు; గోడే ఉంది. | There is nothing behind my chair; there is only a wall. |

నేను 'I'

మేం (మేము) 'We' (excluding the listener)

మనం 'we' (including the listener)

నువ్వు 'you' (very intimate and inferior)

మీరు (a) 'you' (pl.)
(b) 'you' (formal and polite, sg).

ఉన్నాను 'I am/was'

లేను I am/was not'

ఉన్నాం (ఉన్నాము) 'we are/were'

లేం (లేము) 'we are / were not :

ఉన్నావు you are/were ' [sg.] informal and intimate]

లేవు 'you are/were not , [sg., informal and intimate]

ఉన్నారు 'you are/were' [pl. 'formal and polite' sg.]
లేరు 'you are/were not' [pl. 'formal and polite' sg.]

ఉన్నాడు 'he is/was' [sg' 'informal and intimate]
లేడు 'he is/was not' [sg. 'informal, and intimate]

ఉన్నారు [a] Those persons are/were [pl'] [b] 'he is/was, [sg., formal and polite)
లేరు [a] Those persons are/werenot [b] 'he is/was not' [sg.,formal' and polite]

ఉంది (ఉన్నది) 'it/she is/was,
లేదు 'it/she is/was'

ఉన్నాయి 'those things are/were
లేవు 'those things are not'

నేను గదిలో ఉన్నాను. I am in the room.

అతను ఉద్యోగంలో ఉన్నాడు. He is in service.

మనం క్లాసులో ఉన్నాం. We are in the class.

నువ్వు పనిలో ఉన్నావు. You are engaged in work.

మీరు కోపంలో ఉన్నారు. you are in anger.

రాధ తోటలో ఉంది. Radha is in the garden.

ఆఫీసరుగారు టూర్‌లో ఉన్నారు. Officer is in tour.

ప్లాజా టాకీసులో కొత్త సినిమా ఉంది. There is a new cinema in the Plaza talkies.

పంచదారలో చీమలు ఉన్నాయి. There are ants in the sugar.

నువ్వు నిన్న సాయంత్రం ఎక్కడ ఉన్నావు? Where did you stay last evening?

మా అక్కయ్యగారి ఇంట్లో ఉన్నాను. I was in my elder sister's house.

మీరు ఢిల్లీలో ఎప్పుడున్నారు? When did you stay in Delhi?

నిరుడు ఉన్నాం. We were there last year.

మీ రిప్పుడెక్కడున్నారు. Where do you reside now?

మేమిప్పుడు కొత్తఇంట్లో ఉన్నాం. Now we reside in the new house.

ఆ పెట్టెలో ఏమున్నాయి? What are there in the box?

| | |
|---|---|
| పుస్తకాలున్నాయి. | There are books. |
| రంగా, నువ్వు నిన్న ఊళ్ళో ఉన్నావా ? | Ranga, were you present in the town yesterday ? |
| నిన్న లేను. | Not yesterday. |
| మీరు ఆ పచ్చ మేడలో ఉన్నారా ? | Are you residing in that green building ? |
| లేము. ఈ తెల్ల మేడలో ఉన్నాం. | No. We are residing in this white building. |
| వాళ్లు దారిలో ఉన్నారా ? | Are they on the way ? |
| ఔను. సగం దారిలో ఉన్నారు. | Yes, they are half way. |
| నరసయ్యగారి తమ్ముడు ఉద్యోగంలో ఉన్నాడా ? | Is Mr. Narasayya's younger brother in service ? |
| లేడు. | No' he is not. |
| శారద కారులో లేదా ? | Isn't Sarada in the car ? |
| లేదు. దుకాణంలో ఉంది. | No, she is in the shop. |
| బజారులో పంచదార ఉందా ? | Is there sugar available in the market ? |
| లేదు. నల్లబజారులో ఉంది. | No. It is available in black market . |
| ఇంట్లో పాలు లేవా ? | Don't you have milk in the house ? |
| ఉన్నాయి. కాఫీ కావాలా ? | There is milk. Do you want coffee ? |
| పిల్లలు ఇంట్లో లేరా ? | Aren't the children in the house ? |
| లేరు. దొడ్లో ఆటల్లో ఉన్నారు. | No, they are engaged in playing in the back yard. |

# LESSON 9

చదువు 'read'　　చదవడం (చదవటం) * 'reading'

నడుచు 'walk'　　నడవటం 'walking'

చెప్పు 'tell'　　చెప్పడం 'telling'

అమ్ము 'sell'　పిలుచు 'call　పాడు 'sing'

తూచు 'weigh'　ఉపయోగించు 'use'　మార్చు 'alter, change, shift'

కట్టు 'build, bind'　పెట్టు 'put'　వెళ్ళు 'go'

అను 'say'　ఉండు 'be'

తిను 'eat'

విను 'hear'

ఇచ్చు 'give'　తెచ్చు 'bring'　వచ్చు 'come'

పోవు 'go'　చూచు 'see'　లేచు 'get up'

| | |
|---|---|
| పత్రిక చదవడం మంచిది. | It is good to read a news paper. |
| ఇల్లు అమ్మడం మంచిది కాదు. | It is not good to sell the house. |
| ఎండలో నడవడం కష్టం. | It is difficult to walk in the hot sun. |
| జానకి ఆ సంగతి చెప్పడం ఎందుకు ! | Why should Janaki tell that matter ? |
| సుశీల పాట పాడటం ఎప్పుడు ? | When is Suseela singing a song ? |
| బాల్ పాయింట్ పెన్ను ఉపయోగించడం మంచిది. | It is good to use a ball point pen. |

---

* -aDam/aTam (like-*ing* in English) is added to a verbal base like ***ṭṣadav-***, to make it a verbal noun.

| | |
|---|---|
| ఇప్పుడు మకాం మార్చడం నీకు మంచిది కాదు. | It is not good for you to change the residence now. |
| ఆయన ఇల్లు కట్టడం మంచిది. | It is good for him to construct a house, |
| పుస్తకాలు కిటికీలో పెట్టడం తప్పు. | It is wrong to put books in the window. |
| మల్లిక ఢిల్లీ వెళ్ళడం ఎప్పుడు ? | When is Mallika going to Delhi ? |
| చెడ్డమాటలు అనడం ఎందుకు ? | Why should [you] speak nasty words ? |
| మీరు ఉండడం ఎక్కడ ? | Where do you stay ? |
| అతనికి డబ్బు ఇయ్యడం (ఇవ్వడం) ఎలా ? | How to give him money ? |
| పుస్తకం. మీరు తేవడం ఎందుకు ? | Why should you bring the book ? |
| మీరు రావడం ఎప్పుడు ? | When did you arrive ? |
| ఇప్పుడు వెళ్ళడం ఎక్కడికి ? | Where are you going now ? |
| ఆ సినిమా చూడడం ఎందుకు ? | Why should [you] see that movie ? |
| ఆమె లేవడం ఐదు గంటలకు. | She gets up at 5 O'clock. |
| నేను రావడం ఇప్పుడే. | I am coming just now. |
| ఆవిడ వెళ్ళడం నిన్న. | It was yesterday that she had left the place. |
| చెన్నయ్య రావడం రేపు. | Chennayya will come tomorrow. |
| చదవడానికి * | 'for reading/to read' |

| | |
|---|---|
| తీరిక/తీరుబాటు 'leisure' | మాట 'word' |
| భేదం 'difference' | చాలామంది 'many people' |
| దగ్గర/దగ్గిర 'near, at, with' | అన్నం 'cooked rice' |

| | |
|---|---|
| నాకు చదవడానికి పుస్తకం ఉంది. | I have a book to read. |

---

* *tsadavaDaani* is the oblique form of *tsadavaDam* that occurs before the dative suffix *-ki*.

| | |
|---|---|
| అతనికి చదవడానికి టైములేదు. | He has no time to read. |
| నీకు రావడానికి తీరిక ఉంది. | You have leisure to come [here]. |
| ఆయనకు వెళ్ళడానికి తీరిక లేదు. | He has no leisure to go. |
| కొనడానికి నా దగ్గిర పైసలున్నాయి. | I have got money [small change] to buy. |
| వాడికి తినడానికి అన్నం లేదు. | He has no food to eat. |
| నీ మాట వినడానికి బాగుంది. | Your word is good to hear. |
| ఆమెకు చూడడానికి కళ్ళు లేవు. | She has no eyes to see. |
| నాకు ఇవ్వడానికి నీ దగ్గర డబ్బు లేదా ? | Don't you have money to give me ? |
| చెప్పడానికి, చెయ్యడానికి భేదం ఉంది. | There is difference between saying and doing. |
| వాళ్ళ ఇంట్లో తినడానికి చాలామంది ఉన్నారు. | In their house, there are a good number of persons to feed themselves [derogatory]. |
| ఆ అమ్మాయి చూడడానికి బాగాలేదు. | That girl is not good to look at. |
| బండి రావడానికి టైము ఉంది. | There is time for the train to arrive. |
| అతనికి రాయడానికి కలం లేదు. | He has no pen to write, |
| బొంబాయి వెళ్ళడానికి ఆమెకు డబ్బు లేదు. | There is no money for her to go to Bombay. |
| తాగడానికి కూజాలో మంచినీళ్ళు లేవు. | There is no [good] water in the jar, to drink. |

చదవండి 'please read'

రాయండి 'please write'

చూడండి 'please see'

నడవండి 'please walk'

అమ్మండి 'please sell'

పాడండి 'please sing'

తినండి 'please eat,

చెప్పండి 'please tell'

వినండి 'please listen'

చెయ్యండి 'please do'

ఆగండి 'please stop'/wait

కొనండి 'please buy'

కట్టండి 'please build/bind'

ఉండండి 'please stay/wait/remain'

| | |
|---|---|
| రండి 'please come' | తెండి 'please bring' |
| లేవండి 'please get up' | ఇయ్యండి/ఇవ్వండి 'please give' |
| మాట్లాడండి 'please speak' | |
| పద్మావతిగారూ, పాఠం చదవండి. | Miss/Mrs. Padmavathi, please read the lesson. |
| అబ్దుల్లాగారూ, జవాబు చెప్పండి. | Mr. Abdullah, tell me the answer. |
| రాంసింగుగారూ, నడవండి. | Mr. Ramsingh, please get along [walk]. |
| సరోజినిగారూ, ఆ పాట వినండి. | Miss/Mrs. Sarojini, please listen to that song. |
| మీరందరూ తెలుగులో మాట్లాడండి. | All of you, please speak in Telugu. |
| పుస్తకంమీద మీ పేరు రాయండి. | Please write your name on the book. |
| తెలుగు సినిమాలు ఎక్కువ చూడండి. | Please see more Telugu movies. |
| ఆ పని మీరు చేయ్యండి. | You please do that work. |
| ఒక్క నిమిషం ఆగండి. | Please wait a minute. |
| దుకాణంలో మంచి సరుకు అమ్మండి. | Sell good material in the shop. |
| ఆ చీర బాగుంది; కొనండి. | That saree is good; please buy. |
| సులోచనగారూ, ఒక పాట పాడండి. | Miss/Mrs. Sulochana, please sing a song. |
| హైదరాబాదులో ఇల్లు కట్టండి. | Construct a house in Hyderabad. |
| ఆ పుస్తకాలు కట్ట కట్టండి. | Please make a bundle of those books. |
| సుబ్బారావుగారూ, ఈ రసగుల్లా తినండి. | Mr. Subbarao, please take [eat] this rasagulla. |
| మీరు మా ఇంట్లో ఉండండి. | You please stay in my house. |
| రేపు మా ఆఫీసుకు రండి. | Please come to my office tomorrow. |
| నా పుస్తకం అక్కడికి తెండి. | Please bring my book to that place. |
| పొద్దున్నే నిద్రలేవండి. | Get up from sleep early in the morning. |
| ఆమె అడ్రసు ఇయ్యండి. | Please give [me] her address. |
| ఫోనులో పిలవండి. | Please call on the phone. |

ఇంట్లో కలవండి. Meet at home.

తలనొప్పి తగ్గడానికి అనాసిన్ వాడండి. Use anacin to get rid of [your] head ache.

—ఆరా ! 'vocative suffix added to a plural form'

యువకుడు 'young man' యువతి 'young woman'

యువకులు 'young men' యువతులు 'young women'

సైన్యం 'army' సంఘసేవ 'social service'

కూర్చోను (కూచోను) 'sit' నించోను (నిల్చోను) 'stand up'

సోదర సోదరీమణులు Ladies and gentlemen [brothers & sisters; used in a formal address] సుదినం 'lucky day [good day']

యువకుల్లారా ! సైన్యంలో చేరండి. Young men ! Join the army.

యువతుల్లారా ! సంఘసేవ చేయ్యండి. Young women ! Do social service.

సోదర సోదరీమణులారా ! ఈ రోజు మనకు సుదినం. Ladies and gentlemen ! Today is a lucky a day for us.

*

అమ్మాయిలూ, మీరంతా అక్కడ కూర్చోండి. All of you, girls, sit there.

*

అబ్బాయిలూ, మీరందరూ ఇక్కడ నించోండి. All of you, boys, stand here.

---

* *-aaraa*, the vocative suffix, is presently confined to formal occasions. In the informal way of address, the final vowel is lengthened, in the singular as well as plural (e.g., *raadhaa, abbaayiluu* etc.). However there is a tendency to drop the final vowel, as in the case of *abbaay* and *ammaay !*

| | |
|---|---|
| పాపా, నీ పేరు చెప్పు* ! | Baby, tell me your name ! |
| బాబూ, ఆ పేపరు ఇయ్యి ! | Boy, give that paper ! |
| మీనాక్షీ, ఈ ఉత్తరం చదువు ! | Meenakshi, read this letter. |
| బాలయ్యా, నా సంచీ అక్కడ పెట్టు! | Balayya, put my bag there. |
| + | |
| లక్ష్మీ, పాఠం చదువమ్మా ! | Lakshmi, read the lesson [my dear]. |
| రంగా, ఆ దువ్వెన ఇయ్యమ్మా ! | Ranga give me that comb[my dear]. |
| రాముడూ, ఇక్కడికి రా ! | Rumudu, come here ! |
| అద్దం తే ! | Bring that mirror ! |
| ఒక గ్లాసు మంచినీళ్ళు ఇయ్యి ! | Give me a glass of water ! |
| ఫైలు ఆయన దగ్గర ఉంచు ! | Keep the file with him. |

| | POSITIVE | NEGATIVE |
|---|---|---|
| Singular | చెప్పు | చెప్పకు |
| Plural/Polite | చెప్పండి | చెప్పకండి |
| | విను | వినకు |
| | వినండి | వినకండి |
| | మాట్లాడు | మాట్లాడకు |
| | మాట్లాడండి | మాట్లాడకండి |

---

*Normally, the imperative form in singular number ends in *-u*, like *tiru, veLLu, tsuuDu, eDugu*, etc. But, ***iyyi, raa, tee, poo*** are are exceptions.

\+ *-amma* is added to a verb in the imperative. It denotes endearment towards an youngster, boy or a girl. In the case of elders, *-ayya* (masculine) or *-amma* (feminine) is added to denote politeness (with or without the honorific suffix, - ***gaaru***), In the case of an inferior, socially or otherwise, we use the form to recognize his (or her) self-respect.

| | |
|---|---|
| ఇయ్యి | ఇయ్యకు |
| ఇయ్యండి | ఇయ్యకండి |
| నడు | నడవకు |
| నడవండి | నడవకండి |
| రాయి | రాయకు |
| రాయండి | రాయకండి |
| వెళ్ళు | వెళ్ళకు |
| వెళ్ళండి | వెళ్ళకండి |
| రా | రాకు |
| రండి | రాకండి |
| పో | పోకు |
| పోండి | పోకండి |
| పద | — |
| పదండి | — |
| లే | లేవకు |
| లేవండి | లేవకండి |
| తే | తేకు |
| తేండి | తేకండి |

| | |
|---|---|
| ఆ విషయం వాడికి చెప్పు. | Tell that matter to him ! |
| ఆ విషయం వాడికి చెప్పకు. | Don't tell that matter to him ! |
| బాబూ, ఆ సంచీ అక్కడ పెట్టు. | Boy, put that bag there ! |
| పాపా, గ్లాసు ఇక్కడ పెట్టకు. | Baby, don't put the tumbler here ! |
| ఈ రోజు సినిమాకు వెళ్ళకు. | Don't go to the movie today ! |
| రోడ్డు మధ్యలో నడవకు. | Don't walk in the middle of the road ! |

| | |
|---|---|
| ఇక్కడ పాటలు పాడకు. | Don't sing songs here ! |
| నువ్విప్పుడు రాకు. | Don't you come now ! |
| దానికి ఉత్తరం రాయకు. | Don't write a letter to her ! |
| చెడ్డ పుస్తకాలు చదవకు. | Don't read bad books. |
| ఆ సినిమా తప్పకుండా చూడండి. | Please see that movie without fail ! |
| వాడికి డబ్బు ఇయ్యకండి. | Don't give him money ! |
| రేపు రాత్రి మా ఇంటికి భోజనానికి రండి. | Please come to my house for dinner, tomorrow night. |
| ఆ అర్జంటు ఫైలు ఇక్కడికి తెండి. | Please bring that urgent file here. |

*

| | |
|---|---|
| అందం 'beauty' | అందంగా 'beautifully' |
| పెద్ద 'big / loud' | పెద్దగా 'loudly' |
| మెల్లగా 'slowly / gently' | తొందరగా/త్వరగా 'quickly' |
| సంతోషంగా 'happily / joyfully' | విచారంగా 'sadly' చురుకుగా 'actively' |
| తియ్యగా 'sweetly' | తెలివితక్కువగా 'foolishly' |

గట్టిగా/బిగ్గరగా 'loudly'

| | |
|---|---|
| ఆ బొమ్మ అందంగా ఉంది. | That picture/doll is beautiful. |
| ఆయన దగ్గర పెద్దగా మాట్లాడకండి. | Don't talk loudly with him. |
| ఆమెకు ఫోనులో మెల్లగా చెప్పండి. | Tell her on phone gently. |
| తొందరగా నడవండి. | Walk quickly. |

---

* *-gaa* is added to a noun or an adjective to make it an adverb Similarly *ly* is added in English.

| | |
|---|---|
| మెల్లగా నడవకండి; మనకు టైము లేదు. | Don't walk slowly; we don't have time. |
| సంతోషంగా ఉండండి. | Be happy. |
| విచారంగా ఉండకు. | Don't be sad. |
| చురుకుగా పని చెయ్యి. | Work actively. |
| ఈ పండు తియ్యగా ఉంది. | This fruit is sweet. |
| తెలివితక్కువగా మాట్లాడకు. | Don't talk foolishly. |
| గట్టిగా అరవకు. | Don't talk loudly (don't shout). |
| ఆయన కోపంగా ఉన్నారు. | He is angry. |
| ఏమండీ, కులాసాగా ఉన్నారా ? | Hello, are you fine? |
| ఈ పుస్తకం లావుగా ఉంది. | This book is bulky, |
| అతని చెల్లెలు సన్నగా ఉంది. | His sister is slim (or lean). |
| నీళ్ళు వేడిగా ఉన్నాయి. | Water is hot. |
| నాకు తలనొప్పిగా ఉంది. | I have headache. |
| వాళ్ళ ఇంట్లో గదులు విశాలంగా ఉన్నాయి. | Rooms are spacious in their house. |
| ఆ సందు ఇరుకుగా ఉంది. | That lane is narrow. |
| ఈ నుయ్యి లోతుగా లేదు. | This well is not deep. |
| ఆ గుడ్డ మెత్తగా ఉంది. | That cloth is soft. |
| ఈ గోడ నున్నగా లేదు. | This wall is not smooth. |
| ఆయన బల్ల గుండ్రంగా ఉంది. | His table is round. |
| ఆమె మొహం కోలగా ఉంది. | Her face is of oval shape. |

| | |
|---|---|
| ఆటోలో వస్తాను. | I shall come in auto-rikshaw. |
| దానికన్నా, బస్సులో రావడం మంచిది. | Rather than that, it is better to come by a bus. |
| నిజమే. ఈ రోజుల్లో ఆటోకంటె బస్సే క్షేమం. | It is true. Nowadays bus is safer than an auto rikshaw. |
| మా బస్సు నాంపల్లి నుంచి కోఠీ గుండా వస్తుంది. | Our bus comes from Nampalli, via Kothi. |
| ఔనౌను ! చాలా బస్సులు కోఠీ ద్వారా వెళ్తాయి. | Yes, yes ! Many buses go through Kothi. |
| అన్నట్టు, ఎల్లుండి ఆదివారం కదూ ! | By the by, day-after-tomorrow is a Sunday, isn't it ? |
| కాని, ఆదివారం నాకు ఖాళీ ఉండదు. మా ఇంటికి చుట్టాలు వస్తారు. | But, I won't be free on Sunday. Relatives will come to my house. |
| అయితే మరో ఆదివారం రండి. | Then, please come some other Sunday. |
| అలాగే, తప్పకుండా వస్తాను. | Oh yes, I shall come without fail. |
| రెండో ఆదివారం వస్తారా ? | Will you come on second Sunday (in this month). |
| అప్పుడు నాకు తీరికే. | Then I shall be free (I shall be at leisure). |
| అయితే సకుటుంబంగా రండి. ఆ రోజంతా మా ఇంట్లో ఉండండి. | Then please come with your family. Please stay for the whole day with us. |
| తప్పకుండా ! | Certainly. |

# LESSON 10

| | |
|---|---|
| చదువుతున్నాను | 'I am reading' |
| చదవడంలేదు | '(I am) not reading' |
| వింటున్నారు | '(You)are listening' |
| వినడంలేదు | '(You) are not listening' |
| రాస్తున్నారు | '(they) are writing' |
| రాయడంలేదు | '(they) are not writing' |

| | |
|---|---|
| నేను పత్రిక చదువుతున్నాను. | I am reading a news paper. |
| నేను ఉత్తరం చదవడంలేదు. | I am not reading the letter. |
| మీరు పాట వింటున్నారు. | You are listening a song. |
| మీరు మా మాటలు వినడం లేదు. | You are not hearing our conversation (words). |
| వాళ్ళు పాఠం రాస్తున్నారు. | They are writing (from) the lesson. |
| వాళ్ళు ప్రశ్న రాయడం లేదు. | They are not writing the question. |
| నేను బజారుకు వెళ్తున్నాను. | I am going to the market. |
| మేము కూరగాయలు కొంటున్నాం. | We are buying vegetables. |
| మనం బస్సు ఎక్కడం లేదు. | We are not getting into the bus. |
| నువ్వు అబద్ధం చెబుతున్నావు. | You are telling a lie. |
| మీరు ఢిల్లీలో ఉంటున్నారు, కదూ ? | You are living in Delhi, aren't you? |
| వాడు అన్నం తింటున్నాడు. | He is taking (eating) food. |

| | |
|---|---|
| అతను ఆఫీసుకు పోతున్నాడు. | He is going to the office. |
| ఆయన ఇల్లు అమ్మడం లేదు. | He is not selling the house. |
| ఆమె పాట పాడుతున్నారు. | She is singing a song. |
| ఆవిడ ఉద్యోగం చెయ్యడం లేదు. | She is not doing a job. |
| వారు ఉపన్యాసం ఇస్తున్నారు. | He/she is giving a lecture. |
| అది ఏడుస్తున్నది (ఏడుస్తోంది). | That (female) baby is crying. |
| రైలు వస్తున్నది (వస్తోంది). | The train is arriving. |
| వాళ్ళు సినిమాకు వెళ్తున్నారు. | They are going to a movie. |
| వీళ్ళు ఈ ఊళ్ళో ఉండడంలేదు. | These (persons) are not residing in this town/city. |
| పిల్లలు పువ్వులు కోస్తున్నారు. | Children are plucking flowers. |
| మా అబ్బాయి నీళ్ళు తోడుతున్నాడు. | My son is drawing water (from the well). |
| డైరెక్టరుగారు టూరు వెళ్ళడంలేదు. | The director is not going on tour. |
| అరవింద పరీక్షకు కూర్చోడంలేదు. | Aravinda is not sitting for the examination. |
| ఆ ఫైలు తొందరగా కదలడంలేదు. | That file is not moving quickly. |

* –ని/ను 'accusative suffix added to the oblique form of a noun or a pronoun

| | |
|---|---|
| నన్ను 'me' | నిన్ను 'you' |
| మమ్మల్ని 'us' (excl.) | మిమ్మల్ని 'you' |
| మనను/మన్ని/మనల్ని 'us' (incl.) | వాళ్ళను 'them' (persons) |
| వాణ్ణి 'him' (intimate/inferior) | అతన్ని 'him' (informal) |
| ఆయన్ని 'him' (formal) | వారిని 'him/her' (very formal) |
| ఆమెను 'her' | ఆవిణ్ణి 'her' (formal) |
| దాన్ని 'it/her (niferior)' | వాటిని 'them' (things) |

*- *nu/ni* is the accusative suffix added to the oblique from of a noun or a pronoun, e.g., *nan-nu* 'me', *atan-ni* 'him'.

| | |
|---|---|
| ఆయన భారతిని పిలుస్తున్నారు. | He is calling Bharati, |
| అతను నన్ను ఎడ్రసు అడుగుతున్నాడు. | He is asking me the address. |
| నిన్ను ఆమె నమ్మడం లేదు. | She is not believing you. |
| వాళ్ళు మమ్మల్ని చూస్తున్నారు. | They are seeing us. |
| ఆవిడ మిమ్మల్ని పిలవడంలేదు. | She is not calling you. |
| ఆయన మనను చూడడంలేదు. | He is not seeing us. |
| వాణ్ణి తొందరగా పిలు ! | Call him quickly. |
| అతన్ని అనవసరంగా తిట్టకు. | Don't scold him unnecessarily. |
| ఆయన్ని పుస్తకం అడగండి. | Please ask him for the book. |
| వారిని ఆఫీసులో కలవకండి. | Don't meet him in the office. |
| ఆమెను పేరు అడుగు. | Ask her the name. |
| ఆవిణ్ణి ఆస్పత్రిలో చేరుస్తున్నారు. | They are admitting her in the hospital |
| దాన్ని ఏమీ అడక్కండి (అడగకండి). | Don't ask her anything, |
| దీన్ని ఎవరికీ ఇయ్యకండి. | Don't give this thing to anybody. |
| వాటిని బీరువాలో పెట్టు. | Put them in the almirah. |
| వాళ్ళను రేపు భోజనానికి పిలవండి. | Please invite them for dinner, tomorrow. |
| - వేపు/వైపు | towords, 'side' (as 'this side' 'that side' or 'which side') |
| - కోసం 'for' | '-వల్ల' 'due to/on account of' |
| - నుంచి/నించి 'from' | లోనుంచి/లోంచి 'from within' |
| ఈ వేపు నాలుగు కార్లు వస్తున్నాయి. | Four cars are coming this side. |
| ఆ వేపు పది ఇళ్ళు (ఇండ్లు) ఉన్నాయి. | There are ten houses on that side, |

| | |
|---|---|
| మీ ఆఫీసు ఏవేపు (ఉంది)? | Which side is your office? |
| నీ కోసం రామయ్యగారు వస్తున్నారు. | Mr. Ramayya is coming for you. |
| మా అమ్మాయికోసం చీర కొంటున్నాం. | We are buying a saree for my daughter. |
| డబ్బుకోసం పాడుపనులు చెయ్యకు. | Don't do bad deeds for the sake of money. |
| బస్సువల్ల దుమ్ము లేస్తోంది. | Dust is rising due to the bus. |
| వానవల్ల బట్టలు తడుస్తున్నాయి. | Clothes are getting wet due to the rain. |
| సమ్మెవల్ల బస్సులు నడవడంలేదు. | Buses are not plying due to the strike, |
| ఆయన్ని అడగడంవల్ల లాభం లేదు. | There is no use (benefit) of asking him. |
| అతను పోవడంవల్ల సంసారం కష్టాల్లో ఉంది. | The family is in the midst of difficulties due to his death. |
| నేను ఆఫీసునుంచి వస్తున్నాను. | I am coming from the office. |
| మా ఇంటినించి ఇక్కడికి చాలా దూరం. | It is a long distance from my house. |
| సరస్వతి కిటికీలోనుంచి చూస్తున్నది. | Saraswati is looking through (from) the window. |
| కూజాలోనుంచి నీళ్ళు కారుతున్నాయి. | Water is oozing from the jar. |
| రెడ్డిగారు మరొక పుస్తకం రాస్తున్నారు (వ్రాస్తున్నారు). | Mr. Reddi is writing another book. |
| మా తమ్ముడు ఉత్తరాలు రాయడం లేదు. | My younger brother is not writing letters. |
| మా అమ్మాయి పువ్వులు కొయ్యడం లేదు. | My daughter is not plucking flowers. |
| వాడు మామిడిపండు కోస్తున్నాడు. | He is cutting a mango fruit. |
| శంకరయ్య చక్కెర తూస్తున్నాడు. | Sankarayya is weighing sugar. |
| అతని తండ్రి ఏమీ తూచడం లేదు. | His father is not weighing anything. |

| | |
|---|---|
| ఆయన ఎర్రసిరా ఉపయోగిస్తున్నారు. | He is using red ink. |
| మా అబ్బాయి కారు ఉపయోగించడం లేదు. | My son is not using the car. |
| ఆయన మకాం మారుస్తున్నారు. | He is changing the residence. |
| సరోజిని చీర మార్చడంలేదు. | Sarojini is not changing (her) saree. |
| రావుగారు ఇల్లు కడుతున్నారు. | Mr. Rao is constructing a house. |
| చెన్నయ్య ఫైలు కట్టడంలేదు. | Chennayya is not tying up the file. |
| ఆవిడ అన్నం పెడుతున్నారు. | She is serving food. |
| అతను వాళ్ళమ్మకి అన్నంపెట్టడం లేదు. | He is not looking after his mother (literally, he is not feeding his mother). |
| వాళ్ళంతా గుడికి వెళ్తున్నారు. | All of them are going to the temple. |
| మేం ఈవేళ సినిమాకు వెళ్ళడంలేదు. | We are not going to see the movie today. |
| అతను అదే అంటున్నాడు. | He is saying same thing. |
| నేను ఆమాట అనడంలేదు. | I am not saying that (matter). |
| పిల్లలు రేడియో వింటున్నారు. | Children are listening to the radio programme. |
| మా తమ్ముడు నామాట వినడంలేదు. | My younger brother is not paying heed to my word. |
| సత్యనారాయణగారు ఉపన్యాసం ఇస్తున్నారు. | Mr. Satyanarayana is giving a lecture. |
| ఎండవేడివల్ల మొక్కలు చస్తున్నాయి. | Plants are dying due to the heat of the sun. |
| మందువల్ల ఎలికలు చావడంలేదు. | Rats are not dying due to the rat-poison. (Rat poison is not effective on the rats). |
| ఆమె మంచినీళ్ళు తెస్తోంది. | She is fetching (drinking) water. |
| అతను పత్రిక తేవడంలేదు, | He is not bringing the news paper (magazine), |

| | |
|---|---|
| మీ అబ్బాయి వస్తున్నాడు. | Your son is coming. |
| శకుంతల రావడంలేదు. | Sakuntala is not coming. |
| బస్సు వేగంగా పోతున్నది. | The bus is going fast. |
| రైలు పోవడంలేదు. | The train is not going. |
| జెండా పైకి లేస్తోంది. | The flag is rising up, |
| ఆయన కుర్చీలోంచి లేవడంలేదు. | He is not getting up from the chair. |
| రామారావు ప్రొఫెసర్ అవుతున్నాడు. | Ramarao is becoming a professor. |
| రంగాచారి రీడరుకూడా కావడంలేదు. | Rangachari is not becoming even a reader. |
| నేను మద్రాసు వెళ్తున్నాను. | I am going to Madras. |
| ఆమె ఈరోజు ఆఫీసుకు వెళ్ళడంలేదు. | She is not going to the office today. |
| డైరక్టరుగారు విమానంలో వస్తున్నారు. | The director is coming by plane. |
| నాకు రెండువేలుకూడా రావడంలేదు. | I am not getting even two thousand (rupees). |
| ఆవిడ నెలకు వెయ్యిరూపాయిలు ఇన్సూరెన్సు కడుతోంది. | She is paying thousand rupees a month, towards insurance (premium). |
| మీ పిల్లలు బాగా చదువుతున్నారా ? | Are your children studying well ? |
| మీ అమ్మాయి, అల్లుడు పండుగకు వస్తున్నారా ? | Are your daughter and son-in-law coming for the (ensuing) festival ? |
| నా ఫైలు చూస్తున్నారా ? | Are you looking into my file ? |
| రేపు ఆదివారం మీఇంటికి వస్తున్నాను. | I am coming to your house, the coming Sunday. |

# LESSON 11

| | |
|---|---|
| చదువుతాను | 'I (shall/will) read' |
| చదవను | 'I shall/will not read' (I do not read) |
| వింటారు | '(You) will hear' |
| వినరు | 'You will not hear' (You do not hear) |
| రాస్తావు | 'You will write' |
| రాయవు | 'You will not write' (You do not write), |
| నేను పాఠం చదువుతాను. | I shall read the lesson. |
| నేను 'హిందూ' పేపరు చదువుతాను. | I read the news paper 'The Hindu'. |
| ఈ రోజురాత్రి ఏమీ చదవను. | I shall not read anything tonight. |
| నేను నీ ఉత్తరాలు చదవను. | I do not read your letters. |
| మీరిప్పుడు సుశీల పాట వింటారు. | You will now listen to Suseela's song. |
| మీనాక్షిగారు హిందీ పాటలు వింటారు. | Miss/Mrs. Meenakshi listens to Hindi songs. |
| మీ ఉపన్యాసం వాళ్ళు వినరు. | They will not listen to your lecture. |
| ఆయనపిల్లలే ఆయనమాట వినరు. | His own children do not pay heed to to his word. |
| రేపు ఆయనకు ఉత్తరం రాస్తావు కదూ? | You will write a letter to him tomorrow; won't you? |
| నువ్వు ఇంగ్లీషులో కవిత్వం రాస్తావు. | You write poetry in English. |

| | |
|---|---|
| నువ్వు కార్డుకూడా రాయవు. | You will (do) not wirte even a post card. |
| నువ్వు మీ ఆవిడకుకూడా ఉత్తరాలు రాయవు కదూ ? | You do not write letters even to your wife; do you ? |
| నేను ఈ పుస్తకం చదువుతాను. | I shall read this book. |
| అతను మీమాట వింటాడు. | He pays heed to your word. |
| ఇతరుల ఉత్తరాలు నేను చదవను. | I do not read the letters of others. |
| వాడు తెలుగు పాటలు వినడు. | He does not listen to Telugu songs. |
| ఆయన ఇప్పుడు ఇంట్లోనే ఉంటారు. | He stays home this hour. |
| అతను గంటకు ఐదుమైళ్ళు నడుస్తాడు. | He walks five miles an hour. |
| ఈ ఊళ్ళో పనసపండ్లు అమ్ముతారు. | They sell jack fruits in this town /city. |
| ఈ దుకాణంలో మంచి బియ్యం అమ్మరు. | They do not sell good rice in this shop. |
| రేపు పొద్దున నేను పనిలో ఉంటాను. | I shall be engaged in work, tomorrow morning. |
| నేను ఎల్లుండి ఊళ్ళో ఉండను. | I won't be available in town day-after-tomorrow. |
| మేము వాళ్ళను పెళ్ళికి పిలవం. | We won't invite them for the marriage. |
| శారద పాటలు పాడదు. | Sarada does not sing songs. |
| కమల సినిమాకు వెళ్తుంది. | Kamala will go to a movie, |
| అరగంటలో రైలు వస్తుంది. | The trains will arrive in half an hour |
| ఉత్తరదేశంలో టీ తాగుతారు. | They drink tea in the north. |
| సుబ్రహ్మణ్యం ఇల్లు కట్టడు. | Subrahmanyam will not construct a house. |
| శంకరయ్య కిరసనాయిలు అమ్మడు. | Sankarayya does not sell kerosene oil. |

| | |
|---|---|
| ఆమె ఏడు గంటలకు రాదు. | She will not come by 7 o' clock. |
| ఈ బస్సు సికిందరాబాదు పోదు. | This bus does not go to Secunderabad. |
| మా పనిమనిషి మంచినీళ్ళు తేదు. | My servant maid does not carry drinking water. |
| అతను రెండేళ్ళకుకూడా ఆఫీసరు కాడు. | He will not become an officer even in two years. |

| | |
|---|---|
| — దాకా/వరకు 'upto' till' | చొప్పున 'at the rate of' |
| — కన్న/కంటె 'than' Via | ఇంకో/మరో 'another' |
| — గుండా/ద్వారా 'through' | —సారి/మాటు '(as in one time, two times etc.) |
| అన్నట్టు 'by the by' | కాని/గాని 'but' |

| | |
|---|---|
| ఆమె రాత్రి పదిగంటల దాకా పని చేస్తారు. | She works till ten o' clock in the night. |
| నేను ఈరోజు పన్నెండు గంటల వరకు చదువుతాను. | I shall read till twelve o' clock, today. |
| అతను హిమాయత్ నగర్ నుంచి కోఠీదాకా నడుస్తాడు. | He walks from Himayatnagar upto Kothi. |
| వాడు గంటకు పదిమైళ్ళచొప్పున సైకిలు తొక్కుతాడు. | He rides on bicycle at the rate of ten miles per hour. |
| ఆమె రోజుకు ఆరురూపాయిల వరకు గడిస్తుంది. | She earns upto six rupees per day. |
| ఇంకో అరగంటదాకా మన బస్సు రాదు. | Our bus will not arrive till another half-an-hour. |
| ఒకసారి మా ఇంటికి వస్తారా ? | Could you come to my house once? |
| ఇప్పుడు కాదు; మరోసారి వస్తాను. | Not now; I shall come some other time. |
| సరే, మీ ఇష్టం ! ఎలా వస్తారు? | Alright, your will ! How (by what means of transport) do you come? |

| | |
|---|---|
| ఆటోలో వస్తాను. | I shall come in auto-rikshaw. |
| దానికన్నా బస్సులో రావడం మంచిది. | Rather than that, it is better to come by a bus. |
| నిజమే. ఈ రోజుల్లో ఆటోకంటె బస్సే క్షేమం. | It is true. Nowadays bus is safer than an auto rikshaw. |
| మా బస్సు నాంపల్లి నుంచి కోఠీ గుండా వస్తుంది. | Our bus comes from Nampalli, via Kothi. |
| ఔనౌను! చాలా బస్సులు కోఠీ ద్వారా వెళ్తాయి. | Yes, yes! Many buses go through Kothi. |
| అన్నట్టు, ఎల్లుండి ఆదివారం కదూ! | By the by, day-after-tomorrow is a Sunday, isn't it ? |
| కాని, ఆదివారం నాకు ఖాళీ ఉండదు. మా ఇంటికి చుట్టాలు వస్తారు. | But, I won't be free on Sunday. Relatives will come to my house. |
| అయితే మరో ఆదివారం రండి. | Then, please come some other Sunday. |
| అలాగే, తప్పకుండా వస్తాను. | Oh yes, I shall come without fail. |
| రెండో ఆదివారం వస్తారా ? | Will you come on second Sunday (in this month). |
| అప్పుడు నాకు తీరికే. | Then I shall be free (I shall be at leisure). |
| అయితే సకుటుంబంగా రండి. ఆ రోజంతా మా ఇంట్లో ఉండండి. | Then please come with your family. Please stay for the whole day with us. |
| తప్పకుండా! | Certainly. |

# LESSON 12

| | |
|---|---|
| చదివాను | 'I read' |
| చదవలేదు | '(I) did not read' |
| విన్నారు . | '(You) heard' |
| వినలేదు | (You) did not hear |
| రాశావు | 'You wrote' |
| రాయలేదు | '(You) did not write' |
| నేను రామాయణం చదివాను. | I read the Ramayanam. |
| నేను బైబిలు చదవలేదు. | I did not read the Bible, |
| మీరు సుబ్బలక్ష్మిపాట విన్నారు. | You (have) heard Subbalakshmi's song. |
| మీరు బడే గులామ్ అలీ ఖాన్ పాట వినలేదు కదూ ? | You did not hear Bade Ghulam Ali Khan's song; did you ? |
| నువ్వు పదిపేజీలు రాశావు. | You wrote ten pages. |
| నువ్వు నాకు ఉత్తరం రాయలేదు. | You did not write a letter to me. |
| అతను అన్నం తిన్నాడు. | He ate food. |
| మేం మామిడిపండ్లు తినలేదు. | We did not eat mango fruits. |
| ఈవేళ నేను నాలుగుమైళ్ళు నడిచాను. | Today, I walked for four miles. |
| నువ్వు నిజం చెప్పలేదు. | You did not tell the truth. |

| | |
|---|---|
| వెంకట్రావుగారు ఇల్లు అమ్మారు. | Mr. Venkatrao has sold (his) house. |
| మా నాన్నగారు ఇప్పుడు పనిలో ఉన్నారు. | My father is presently engaged in work. |
| శాంతమ్మగారు మొన్న ఊళ్ళోలేరు. | Miss/Mrs. Santamma was not in town day-before-yesterday. |
| మిమ్మల్ని డైరక్టరుగారు పిలిచారు. | The Director has called for you. |
| రాధ పేరంటానికి పిలవలేదు. | Radha did not invite (us) for perantam (a gathering of women on any auspicious occasion; haldi-kumkum). |
| సావిత్రి బాగా పాడింది. | Savitri sang well. |
| రంగారావు మైకుదగ్గర పాడలేదు. | Rangarao did not sing at the microphone. |
| పోస్టు ఇప్పుడే వచ్చింది. | Post has come now (letters etc. have been delivered). |
| పరీక్షాఫలితాలు ఇంకా రాలేదు. | Examination results have not come (published) yet. |
| అరుణ ఉత్తరం రాయలేదు. | Aruna did not write a letter. |
| ఉన్నవ లక్ష్మీనారాయణగారు మంచి నవల రాశారు. | Mr. Unnava Laxminarayana wrote a good novel. |
| మీ పిల్లలు మాతోటలో పూలు కోశారు. | Your children have plucked flowers in our garden. |
| అతను చింతపండు తూచలేదు. | He did not weigh tamarind. |
| మేనేజరుగారు నోట్ పుటప్ చేశారు. | The manager has put-up a note. |
| శర్మగారికి మొన్ననే ప్రమోషన్ ఇచ్చారు. | Mr. Sarma has been given promotion recently. |
| మా చాకలి చొక్కాలు మార్చాడు. | My washerman has changed the clothes. |
| నారాయణరెడ్డిగారు కారు మార్చలేదు. | Mr. Narayanareddi has not changed (his) car. |
| మా బావగారు పెద్ద ఇల్లు కట్టారు. | My brother-in-law has constructed a big house. |

| | |
|---|---|
| ఆ అబ్బాయి పరీక్షఫీజు కట్టలేదు. | That boy did not pay his examination fee. |
| మా ఆవిడ గుడికి వెళ్ళింది. | My wife went to the temple. |
| రామ్మూర్తి తెనాలి వెళ్ళలేదు. | Rammurti did not go to Tenali. |
| ఆయన మంచి ఉపన్యాసం ఇచ్చారు. | He gave a good lecture. |
| పేపర్లో మీ ఫోటో చూశాను. | I saw your photo in the newspaper, |
| రామమోహనరావు మొన్న మా ఇంటికి వచ్చాడు | Ramamohanarao came to my house day before yesterday. |
| సీత మంచినీళ్ళు తెచ్చింది. | Sita fetched (drinking) water. |
| ఆరు గంటలబండి ఇప్పుడే పోయింది. | 6 o' clock train has left just now. |
| మా అబ్బాయి బొంబాయి పోలేదు. | My son did not go to Bombay. |
| నేను రాధాకృష్ణన్‌గారి ఉపన్యాసం విన్నాను. | I heard Radhakrishnan's speech. |
| మేము యోగానందగారి పాటలు వినలేదు. | We did not hear Yoganandaji's songs. |

– తో 'with' — తో పాటు 'along with'

గురించి 'about' మూలంగా 'on account of, due to'

| | |
|---|---|
| నేను మా స్నేహితుడితో ఢిల్లీ వెళ్ళాను. | I went to Delhi along with my (male) friend, |
| ఆమెతోపాటు వాడుకూడా వచ్చాడు. | He too came along with her. |
| స్నేహితురాలితో సినిమాకు వెళ్ళావా? | Have you gone to a movie along with your (female) friend ? |
| శారద బాల్‌పాయింట్ పెన్నుతో రాస్తోంది. | Sarada is writing with a ball-point pen, |
| తేలును చెప్పుతో కొట్టు. | Strike the scorpion with a chappal, |

| | |
|---|---|
| అతనితోబాటు నలుగురు భోజనానికి వచ్చారు. | Four persons came along with him for dinner. |
| వాడితో ఏమీ అనకు*. | Don't say anything to him. |
| వాడితో పెద్ద గొడవ వచ్చింది. | A great trouble has arisen due to him |
| ఈ సంగతి సెక్రటరీగారితో చెప్పాను. | I told this matter to the secretary. |
| ఆయన ఆవేశంతో మాట్లాడారు. | He spoke with emotion. |
| ఈ పనితో చస్తున్నాను. | I am dying with (due to) this work. |
| ఆమె జ్వరంతో మూలుగుతున్నది. | She is groaning due to fever. |
| మీ గురించి విన్నాను. | I heard about you. |
| సుందరి గురించి నాకు తెలియదు | I do not know about Sundari. |
| నీ గురించి ఆయనకు చెప్పాను. | I told him about you. |
| వాళ్ళ గురించి నన్ను అడక్కండి. | Don't ask me about them. |
| నా గురించి చూడకండి. | Don't look for me. |
| దాన్ని గురించి వినలేదు. | I did not hear about it/her. |
| వాటి గురించి అరవై రూపాయిలు ఖర్చు అయాయి. | Sixty rupees were spent on account of those things. |
| నీ మూలంగా ఆమెకు కోపం వచ్చింది. | She got angry on account of you. |
| ఆమె మూలంగా అతని ఉద్యోగం పోయింది. | He lost his job on account of her. |

---

* In this context, please note the difference of meaning of the phrase with *-too* (*vaaDitoo* 'to him'). వాడితో ఏమీ అనకు = వాడితో ఏమీ చెప్పకు ! 'Don't tell anything to him'. *-too* can be replaced by *-ki* (*vaaDiki*) in the second sentence, but not in the first sentence.

| | |
|---|---|
| ఆఫీసుపని మూలంగా మేం సినిమాకు వెళ్ళలేదు. | We did not go the movie, due to the office work. |
| మీ మూలంగా నాకు ప్రమోషను రాలేదు. | I did not get promotion on account of you (also means 'I got my promotion, not on account of you'). |
| కరువు మూలంగా ఎన్నో ఆవులూ గేదెలూ చస్తున్నాయి. | So many cows and buffaloes are dying due to the famine. |
| ఇల్లుకట్టడం మూలంగా అతనికి చాలా అప్పుఅయింది. | He ran into debts due to the construction of a house. |
| రేసుల మూలంగా ఆయన ఆస్తి అంతా పోయింది. | He lost all his property on account of the (horse) races. |
| దాని మూలంగా నాకు కోపంవచ్చింది. | I got angry on account of that (her). |
| వాటి మూలంగా అతనికి డబ్బు వచ్చింది. | He got money on account of those things. |
| వాళ్ళ మూలంగా ఆ అమ్మాయి పెళ్ళి జరిగింది. | On account of them the marriage of that girl has taken place. |
| వ్యాపారంవల్ల ఆయనకు నష్టం వచ్చింది. | He lost money due to the business. |
| నా వల్ల నీకు లాభం కలిగింది. | You were benefited on account of me. |
| ఆయనవల్ల అతనికి ఉద్యోగం వచ్చింది. | He got the job on account of him. |
| వాడివల్ల ఈ పని అవుతుంది. | This job will be done by him. (He is capable of doing this job). |
| జ్వరంవల్ల నేను ఆఫీసుకు వెళ్ళలేదు. | I did not go to the office on account of fever. |
| ఈ డిగ్రీలవల్ల ఉపయోగం ఏమిటి? | What is the use of these degrees? |

# LESSON 13

చదువుదాం* 'let us read'
రాద్దాం 'let us write'

విందాం 'let us hear'
చేద్దాం 'let us do'

వెళ్దాం 'let us go'
చెబుదాం 'let us tell'

తెరుద్దాం 'let us open'
వద్దాం 'let us come'

అమ్ముదాం 'let us sell'
నడుద్దాం 'let us walk'

| | |
|---|---|
| ఈ పాఠం చదువుదాం. | Let us read this lesson. |
| ఆయనకు ఉత్తరం రాద్దాం | Let us write a letter to him, |
| ఆవిడ పాట విందాం. | Let us listen to her song. |
| ఆ పని ఇప్పుడే చేద్దాం. | Let us do that work now, |
| మనం పెళ్ళికి వెళ్దాం. | Let us go to attend the marriage. |
| ఈ సంగతి ఆయనకు చెబుదాం. | Let us tell this matter to him. |
| ఆ కిటికీ తెరుద్దాం. | Let us open that window. |
| రేపు మళ్ళీ వద్దాం. | Let us come again tomorrow. |
| మన స్థలం అమ్ముదాం. | Let us sell our house site. |
| నారాయణగుడా దాకా నడుద్దాం. | Let us walk upto Narayanaguda. |
| పాట పాడదామా వద్దా? | Shall we sing a song or not ? |

---

* *-ḍaam* 'let us ...' is added to a verbal base in the hortative,

| | |
|---|---|
| ఇప్పుడొద్దు. | Not now. |
| జిలేబీ తిందామా వద్దా ? | Shall we eat Jilebi or not? |
| తప్పకుండా తిందాం. | Let us eat without fail. |
| నాటకం చూద్దామా, వద్దా? | Shall we see the play or not? |
| సరే, చూద్దాం; పద! | Alright, let us see; get along. |
| తెలుగు పాఠం చదువుదామా, ఇంగ్లీషునవల చదువుదామా ? | Shall we read a Telugu lesson or an English novel? |
| తెలుగుపాఠమే చదువుదాం. | Let us read Telugu lesson (only). |
| పాటలు పాడదామా, ఆటలు ఆడదామా ? | Shall we sing songs or play games? |
| పాటలే పాడదాం. | Let us sing songs (only). |
| ఆవిడకు ఉత్తరం రాద్దామా, కబురు చేద్దామా? | Shall we write a letter or a send a word to her. |
| కబురు చేద్దాం. | Let us send a word to her. |
| రేడియో విందామా, టీ.వీ. చూద్దామా | Shall we listen to a radio programme or watch T.V.? |
| టీ.వీ. చూద్దాం. | Let us watch T.V. |
| ఇందూరు మనం వెళ్దామా, ఆయన వస్తారా ? | Shall we go to Indur or will he come (here)? |
| మనమే వెళ్దాం. | Let us (ourselves) go. |
| ఆయనకు ఏం చెబుదాం ? | What shall we tell him? |
| ఏమీవద్దు. | Nothing is required. |

| | |
|---|---|
| ఆ బ్యాంకులో ఖాతా తెరుద్దామా, డబ్బు ఇంట్లోనే పెడదామా ? | Shall we open an account in that bank or shall we keep money at home? |
| ఖాతా తెరుద్దాం. | Let us open an account. |
| మళ్ళీ వద్దామా, వద్దా ? | Shall we come again or not ? |
| వద్దు. | Not necessary. |
| బంగారం అమ్ముదామా, అప్పు చేద్దామా ? | Shall we sell gold or borrow money? |
| బంగారం మీద అప్పు చేద్దాం. | Let us borrow on gold (by pledging it). |
| సినిమాహాలుదాకా నడుద్దామా బస్సులో వెళ్దామా ? | Shall we walk upto the cinema hall o go in a bus ? |
| బస్సులో పోదాం. | Let us go by bus. |

నిర్ణయించు 'decide'

పరీక్షించు 'examine'

వాదించు 'argue'

విశ్రమించు '(take) rest'

ఆనందించు 'feel joy'

వివరించు 'explain'

సంతోషించు 'feel happy"

సృష్టించు 'create'

రచించు 'write, produce a literary or art piece'

ఆలోచించు 'think'

స్థాపించు 'establish' (institution etc.)

ఆకర్షించు 'attract'

మినహాయించు 'deduct/exempt/exclude'

చలాయించు 'weild authority'

ఫిరాయించు 'change' (statement of facts, allegiance to a political party etc.)

కత్తిరించు 'cut with scissors'

డాక్టరుగారు ఆమెను పరీక్షించారు. The doctor has examined her.

| | |
|---|---|
| ఆమెకు ఇంజక్షను ఇవ్వడానికి నిర్ణయించారు. | He has decided to give her an injection. |
| ఆయన నాతో గంటసేపు వాదించారు. | He argued with me for an hour. |
| ఆవిడ గదిలో విశ్రమించారు. | She took rest in the room. |
| అతను చాలా ఆనందించాడు. | He felt joy. |
| మేం చాలా సంతోషించాం. | We felt happy. |
| ఆయన నూరు పుస్తకాలు రచించారు. | He wrote hundred books. |
| ఈ ప్రపంచాన్ని ఎవరు సృష్టించారు? | Who created this world ? |
| ఆ సంగతి బాగా ఆలోచించు. | Think over the matter well. |
| ఆయన ఒక కాలేజి స్థాపించారు. | He established a college. |
| వారు ఉపన్యాసంతో చాలామంది శ్రోతలను ఆకర్షించారు. | He attracted a good number of audience with his lecture. |
| నా జీతంలో ఈ నెల మూడు వందలు మినహాయించారు. | Three hundred rupees have been deducted from my salary, this month. |
| ఆయన మూడేళ్ళనుంచి అధికారం చలాయిస్తున్నాడు. | He has been weilding authority for the last three years. |
| నిందితుడు కోర్టులో ప్లేటు ఫిరాయించాడు. | The accused has changed his version (of facts) in the court. |
| దర్జీ ఇంకా గుడ్డ కత్తిరించలేదు. | The tailor has not yet cut the cloth: |

పరుగెత్తు/పరిగెత్తు 'run'

నిద్రపోవు 'go to sleep'

జబ్బుపడు 'fall sick'

నిద్రలేచు 'get up from sleep'

భోజనంచేయు/భోంచేయు 'eat food'

ప్రయాణంచేయు 'travel'

ప్రమాణంచేయు 'swear/take oath'

పెళ్ళిచేయు 'perform marriage'

దర్యాప్తుచేయు 'investigate/enquire' బదిలీచేయు 'transfer'

దరఖాస్తుచేయు 'apply' రాజీనామాచేయు 'resign'

దాఖలుచేయు 'submit' (application etc.) బర్తరఫ్ చేయు 'dismiss' (from service)

ఫైలుచేయు 'file (papers etc.)' టైపుచేయు 'type-write'

బదిలీఅవు 'be tansferred' ఖర్చవు 'be spent' (money etc.)

రిజిస్టరవు 'be registered' (document etc.) మీటవు 'meet' (a person)

| | |
|---|---|
| దొంగ పరిగెత్తాడు. | The thief ran (away). |
| మా పాప నిద్రపోయింది. | Our baby went to sleep. |
| ఆయన జబ్బుపడ్డారు. | He fell ill. |
| వాడు ఏడుగంటలకు నిద్రలేచాడు. | He got up from sleep at 7 o' clock. |
| నేనిప్పుడే భోజనం చేశాను. | I have taken meal (just now). |
| మేము రెండువందల కిలోమీటర్లు బస్సులో ప్రయాణం చేశాం. | We travelled two hundred kilo-metres by bus. |
| సాక్షి ప్రమాణం చేశాడు. | The witness has taken oath. |
| ఆయన ఈ సంవత్సరం అమ్మాయి పెళ్ళి చేశారు. | He performed his daughter's marriage this year. |
| పోలీసులు ఆ కేసు దర్యాప్తు చేస్తున్నారు. | The police men are investigating that case. |
| వెంకటయ్యను మహబూబ్‌నగర్ బదిలీ చేశారు. | Venkatayya has been transferred to Mahbubnagar. |
| ఆమె ఉద్యోగం కోసం దరఖాస్తు చేసింది. | She applied for a job. |

| | |
|---|---|
| మంత్రిగారు నిన్న రాజీనామా చేశారు. | The minister had resigned the from post yesterday. |
| వాళ్ళు కోర్టులో దస్తావేజు దాఖలు చేశారు. | They submitted the legal document in the court, |
| అతన్ని ఉద్యోగంలోంచి బర్తరఫ్ చేశారు. | He was dismissed from service. |
| నేను ఉత్తరాలు ఫైలు చేశాను. | I filed the letters. |
| ఆయన ఆ వ్యాసం ఇప్పుడే టైపుచేశారు. | He typed the article (essay) just now. |
| ఆమెకు బొంబాయిలో వెయ్యి రూపాయిలు ఖర్చయ్యాయి. | She spent one thousand rupees in Bombay. |
| రామనాథంగారికి గోపాలపురం బదిలీ అయింది. | Mr. Ramanatham has been transferred to Gopalapuram. |
| అతని దస్తావేజు రేపు రిజిస్టరవుతుంది. | His document (title deed) will be registered tomorrow. |
| ఈ రోజు సెక్రటేరియట్‌లో మంత్రిగారిని మీటయ్యాను. | Today I met the minister in the secretariate. |
| పదిగంటలకే నాకు ఆకలివేసింది. | I became hungry by ten o' clock itself. |
| మా ఆవిడ గులాబ్‌జామ్ తయారు చేసింది. | My wife has prepared gulabjam. |
| వాడు పిల్లవాణ్ణి భయపెట్టాడు. | He has frightened the boy. |
| అతని భార్య ఈరోజు వంట చెయ్యలేదు. | His wife did not cook food today. |
| నేను రోజుకు పదహారు గంటలు పనిచేస్తాను. | I work sixteen hours a day. |

ఆ పాప భయపడింది. That (female) baby has got frightened.

మా నాన్నగారు నామీద కోప్పడ్డాడు. My father got angry with me.

మా అన్నయ్య జీపు డ్రైవుచేశాడు. My elder-brother drove the jeep.

నువ్వు నాపని పాడుచేశావు. You have spoiled my work.

అతని అర్జీ బుట్టదాఖలు అయింది. His petition has gone to the (waste paper) basket.

అతను వెయ్యిరూపాయిలు ధరావతు కట్టాడు. He paid a deposit of thousand rupees.

వాణ్ణి జైల్లో పెట్టారు. He was put in jail.

అతను కొత్తగా కాపురం పెట్టాడు. He has set-up his family recently.

వాడు నా ప్రాణం తీస్తున్నాడు. He is pestering me.

చదువు 'read' — చదువుకొను* 'read for oneself'

చేయు 'do' — చేసుకొను 'do for one self'

కొను 'buy' — కొనుక్కొను 'buy for one self'

చూచు 'see' — చూసుకొను 'see for one self'

అను 'say' — అనుకొను 'say for oneself' (think)

సుమారు 'about'

రమారమి/దాదాపు 'nearly' — అంటే 'that means'

ఇంచుమించు 'approximately' — ఉన్నమాట 'that's it'

---

* - *konu* is added to the verbal base to denote reflexivity, where the result of an action is meant for the doer himself. - *kun* is an alternant of - *konu*.

| | |
|---|---|
| మంత్రిగారు ప్రసంగం చదివారు. | The minister has read out (his) speech. |
| మంత్రిగారు ప్రసంగం చదువుకొన్నారు. | The minister has read the speech for himself. |
| సుబ్బారావు పని చేశాడు. | Subbarao has done the work. |
| సుబ్బారావు పని చేసుకొన్నాడు. | Subbarao has done the work for himself. |
| వాళ్ళు ఇల్లు కొన్నారు. | They purchased a house. |
| వాడు పుస్తకం కొనుక్కొన్నాడు. | He bought a book for himself. |
| ఆమె నన్ను చూసింది. | She saw me. |
| ఫోటోలో నన్ను చూసుకొన్నాను. | I saw myself in the photograph. |
| ఆయన ఆ మాట అన్నారు. | He said that matter (word). |
| ఆయన అలా అనుకొన్నారు. | He thought that way. |
| మన రాష్ట్రలో సుమారు నూటికి ఇరవై ఐదుమంది చదువుకొన్నారు. | About twenty five persons out of a hundred are educated in our state. |
| మన రాష్ట్రంలో దాదాపు నూటికి డెబ్భైఐదుమంది చదువుకోలేదు. | Nearly seventy five persons out of a hundred are not educated in our state. |
| అతను ఉత్తరం చదువుకొన్నాడు. | He read the letter (for himself). |
| ఈమె ఏమీ చదువుకోలేదు. | She is an illiterate (she did not study anything). |
| కాత్యాయని కంచిపట్టుచీర కొనుక్కొన్నది (కొనుక్కుంది). | Katyayani has purchased a Kanchipuram silk saree. |

| | |
|---|---|
| గంగాభవాని గద్వాల చీర కొనుక్కో లేదు; పోచంపల్లి చీర కొనుక్కుంది. | Gangabhavani did not purchase a Gadwal saree; she purchased a Pochampalli saree, |
| ఆయన అద్దంలో చూసుకున్నారు. | He looked himself in the mirror. |
| ఆ అమ్మాయి హోమ్‌వర్కు చేసుకో లేదు. | That girl did not do her home-work. |
| ఈ గుళ్ళో ఇంచుమించు వెయ్యిమంది దర్శనం చేసుకున్నారు. | Approximately, one thousand persons had visited this temple (had a darshan of the deity). |
| అంటే చాలామంది దర్శనం చేసుకున్నారు అన్నమాట ! | That means, many persons had visited the temple (that's it) ! |
| మక్కామసీదులో రమారమి ఐదువేల మంది నమాజు చేసుకొన్నారు. | Nearly five thousand person have prayed in the Mecca Masjid. |
| ఈ ఇంటిని ఇంకా ఎవరూ కొనుక్కో లేదు. | No body has purchased this house so far. |
| అలివేలు పాట పాడుకొంటున్నది. | Alivelu is singing a song (for her own pleasure). |
| సుబ్బారావు చొక్కాలు ఇస్త్రీ చేసుకొంటున్నాడు. | Subbarao is ironing his shirts. |
| ఆవిడ గదిలో నవల రాసుకుంటూంది. | She is writing a novel in the room. |
| సుబ్రహ్మణ్యం ఇంకా పెళ్ళి చేసుకో లేదు. | Subrahmanyam did not marry so far. |
| అతనిప్పుడే జీతం తీసుకున్నాడు. | He has taken his salary (just now). |
| పాప పడుకోలేదు. | The baby did not go to sleep. |
| ఆమె తలుపు వేసుకోలేదు. | She did not close the door, |

| | |
|---|---|
| అతను బట్టలు మార్చుకున్నాడు. | He has changed his clothes. |
| వాళ్ళింట్లో పండుగ చేసుకోలేదు. | They did not celebrate the festival in their house. |
| నేను తాంబూలం వేసుకుంటాను. | I (shall) take pan. |

| | |
|---|---|
| వినాలి '(one) should listen' | అనాలి 'should say' |
| మాట్లాడాలి 'should speak' | రాయాలి 'should write' |
| చదవాలి 'should read' | చూడాలి 'should see' |
| రావాలి 'should come' | వెళ్ళాలి/పోవాలి 'should go' |
| తెలవాలి/తెలియాలి 'should be known' | ఇయ్యాలి/ఇవ్వాలి 'should give' |
| అందరం 'all of us' | రాత*/దస్తూరి 'hand-writing' |
| కనీసం 'at least' | ఆరున్నర 'six and half' |

| | |
|---|---|
| మనం ఆయన మాట వినాలి. | We should listen to his word. |
| మీరు సరిగా అనాలి. | You should say properly. |
| అందరం తెలుగులోనే మాట్లాడాలి. | All of us should speak only in Telugu. |
| మనం అందంగా రాయాలి. | We should write in a beautiful manner. |
| రోజూ పాఠాలు చదవాలి. | We should study the lessons every day. |
| మీరు మా ఇంటికి భోజనానికి రావాలి. | You should come to my house for dinner. |
| మేం ఈ రోజు సినిమాకు వెళ్ళాలి. | We have to go to see a movie today. |

---

* Elsewhere, ***raata*** means 'fate' as in ***nuduTiraata*** or ***nosaTiraata*** 'fate written on one's forehead; ***brahmaraata*** 'Brahma's writing' (Brahma, the Creator is believed to have written the fate of each person on his forehead). Hence, ***vaaDidi brahmaraata*** means, 'his writing is illegible' (like that of Brahma).

| | |
|---|---|
| మనకందరికీ రాష్ట్రభాష తెలియాలి. | The state language should be known to all of us. |
| నువ్వు నాకు పదిరూపాయలు ఇయ్యాలి. | You owe me ten rupees (you should give me ten rupees). |
| మనం రోజుకు కనీసం ఆరున్నర గంటలు పనిచెయ్యాలి. | We should (have to) work eight hours a day. |
| మా అబ్బాయికి కాలేజి ఫీజు కట్టాలి. | I have to pay the college fee of my son. |
| మా అమ్మాయికి ఈ సంవత్సరం పెళ్ళి కావాలి (అవాలి). | My daughter should get married this year. |
| హాయిగా బతకాలంటే డబ్బు ఉండాలి. | One should have money if one should live happily. |
| పైకి రావాలంటే తెలివి కావాలి. | One should have brains (intelligence) if one wants to come up. |
| బొంబాయి ఎక్స్‌ప్రెస్‌కు వెళ్ళాలంటే తొందరగా బయల్దేరాలి. | (You) should start early (quickly) if (you) want to go by Bombay express. |
| అతను నలభై పేజీలు టైపుచెయ్యాలి. | He has to type forty pages. |
| ఆవిడ ఎనిమిది గంటలకు వంట చెయ్యాలి. | She has to cook food by eight o' clock. |
| వానలు కురవాలి, వరిచేలు పండాలి. | Rains should fall and the paddy fields should grow. |
| మనం తెలుగు బాగా నేర్చుకోవాలి. | We should learn Telugu well. |

చూస్తూ* 'while looking (at/into)'

వస్తూ 'while coming'

చదువుతూ 'while reading'

వెళ్తూ/పోతూ 'while going'

నడుస్తూ 'while walking'

రాస్తూ 'while writing'

పెడుతూ 'while putting'

అడుగుతూ 'while asking'

వింటూ 'while listening to'

మాట్లాడుతూ 'while talking'

తంతూ 'while kicking'

తింటూ 'while eating'

ఆమె సినిమా చూస్తూ నిద్రపోయింది. She went to sleep while seeing the movie.

అతను ఇంటికి వస్తూ పువ్వులు కొన్నాడు. He bought flowers while coming home.

ఆయన పేపరు చదువుతూ రేడియో వింటున్నారు. He is listening to a radio programme while reading the newspaper.

వాడు ఆఫీసుకు వెళ్తూ మా ఇంటికి వచ్చాడు. He came to my house while going to the office.

మా బాబు నడుస్తూ కిందపడ్డాడు. My son fell down, while walking.

లలిత హారతి ఇస్తూ గంట కొడుతున్నది. Lalita is ringing the bell while offering hearati to the deity.

---

* Repetition of such forms is also common, practically with no difference in meaning except emphasis on continuity of action, e.g. చూస్తూ చూస్తూ, నడుస్తూ నడుస్తూ etc.

| | |
|---|---|
| అతను ఉత్తరం రాస్తూ నావేపు చూశాడు. | He looked at me while writing a letter. |
| ఆవిడ అన్నం పెడుతూ నన్ను ఎన్నో ప్రశ్నలు వేశారు. | She put a lot of questions to me while serving food. |
| అరుంధతి ఎడ్రస్ అడుగుతూ డైరీ తెరిచింది. | Arundhati has opened her diary while asking me the address. |
| మా పాప జోలపాట వింటూ నిద్ర పోయింది. | My (female) baby has gone to sleep while listening to a lullaby. |
| మేం మాట్లాడుతూ మాట్లాడుతూ రవీంద్రభారతిదాకా నడిచాం. | We walked upto Ravindrabharati while engaged in talking. |
| ఆ అమ్మాయి బంతిని* తంతూ పరిగెత్తింది. | That girl ran (away) while kicking the ball. |
| అతను అన్నం తింటూ మంచినీళ్ళు తాగుతాడు. | He drinks water while taking food. |
| ఆమె వీణ వాయిస్తూ పాట పాడుతున్నది. | She is singing a song while playing on veena (a musical instrument) |
| అతను ఆఫీసుకు వస్తూ దారిలో నన్ను కలుసుకున్నాడు. | He met me on the way while coming to the office. |
| వాడు పుస్తకం చూస్తూ రాస్తున్నాడు. | He is copying from the book (he is writing while looking into the book). |
| ఆమె వాణ్ణి పిలుస్తూ చెయ్యి ఊపింది. | She waved her hand while calling him. |

---

* The accusative suffix - *ni/ru* is not obligatory and definitely not idiomatic in the neuter gender. Hence, *aa ammaayi banti tantuu parigettindi*. However it is permissible for the purpose of clarity.

| | |
|---|---|
| వాడు చదువుతూ చదువుతూ నిద్ర పోయాడు. | He went to sleep while reading (continuously). |

| POSITIVE | | NEGATIVE |
|---|---|---|
| చదువుతూ | × | చదవకుండా |
| వస్తూ | × | రాకుండా |
| పిలుస్తూ | × | పిలవకుండా |
| తింటూ | × | తినకుండా |
| వింటూ | × | వినకుండా |
| వెళ్తూ | × | వెళ్ళకుండా |
| రాస్తూ | × | రాయకుండా |
| తిడుతూ | × | తిట్టకుండా |

| | |
|---|---|
| ఆమె పుస్తకం చదువుతూ కూర్చుంది. | She sat down, reading the book. |
| ఆమె పుస్తకం చదవకుండా కూర్చుంది. | She sat down without reading the book. |
| అతను మా ఇంటికి వస్తూ మామిడి పండ్లు తెచ్చాడు. | He brought mango fruits while coming to my house. |
| ఆమె నా గదికి రాకుండా వెళ్ళిపోయింది. | She went away without coming to my room. |
| అతను నన్ను పిలుస్తూ నించున్నాడు. | He stood (there) calling me. |
| అతను నన్ను పిలవకుండా చూస్తున్నాడు. | He was looking (at me) without calling me. |
| ఆయన అన్నం తింటూ పాయసం తాగారు. | He drank payasam (kheer) while taking food. |

| | |
|---|---|
| ఆమె అన్నం తినకుండా పులిహోర తిన్నది. | She ate pulihora (tamarind rice) without taking food. |
| శ్యామల పాట వింటూ మేము ఆరు బయట కూర్చున్నాం. | We sat down in the open air, while listening to the song of Syamala. |
| వాడు నా మాట వినకుండా వెళ్లి పోయాడు. | He went away without paying heed to my word. |
| అతను ఆఫీసరుగారి దగ్గరికి వెళ్తూ ఫైలు తీసుకువెళ్ళాడు. | He took the file while going to the officer. |
| ఆమె సినిమాకు వెళ్ళకుండా మా ఇంటికి వస్తున్నది. | She is (was) coming to my house without going to see the movie. |
| వాడు ఉత్తరం రాస్తూ కూర్చున్నాడు. | He sat down, writing a letter. |
| ఆ అమ్మాయి పాఠం రాయకుండా ఊరికే కూర్చుంది. | That girl sat idle without writing the lesson. |
| ఆయన వాణ్ణి తిడుతూ ఇంటికి తీసుకు వెళ్ళారు. | He took him home while scolding him. |
| ఆమె వాణ్ణి తిట్టకుండా బుజ్జగిస్తున్నది. | She is cajoling him without scolding. |

| POSITIVE | NEGATIVE |
|---|---|
| చేసి 'having done' | చెయ్యకుండా 'without doing' |
| వచ్చి 'having come' | రాకుండా 'without coming' |
| చెప్పి 'having told' | చెప్పకుండా 'without telling' |
| అయి 'having become' | కాకుండా/అవకుండా 'without becoming' |
| రాసి 'having written' | రాయకుండా 'without writing' |
| పెట్టి 'having put or kept' | పెట్టకుండా 'without putting or keeping' |

| | |
|---|---|
| చూసి 'having seen' | చూడకుండా 'without seeing' |
| చదివి 'having read' | చదవకుండా 'without reading' |
| అడిగి 'having asked' | అడక్కుండా 'without asking' |
| పిలిచి 'having called' | పిలవకుండా 'without calling' |
| అతను పని చేసి డబ్బు అడిగాడు. | He asked for money having done the work. |
| అతను పనిచెయ్యకుండా డబ్బు అడిగాడు. | He asked for money without doing the work. |
| నేను ఇంటికి వచ్చి స్నానం చేశాను. | I took my bath after coming home. |
| మీరు పక్కింటికి వచ్చి మా ఇంటికి రాకుండా వెళ్ళారు. | You went (away) without coming to my house, having come to the neighbouring house. |
| ఆ సంగతిచెప్పి తిరిగి వచ్చాను. | I returned after telling the matter. |
| ఆమె నాతో చెప్పకుండా వెళ్ళిపోయింది. | She left the place without telling me. |
| ఆవిడ ఈ ఊరికి బదిలీఅయి వచ్చారు. | She came here on transfer. |
| అతను ఆఫీసరు కాకుండానే అధికారం చూపిస్తున్నాడు. | He is showing his authority even without becoming an officer. |
| ఆమె నవలలు రాసి పదివేలు సంపాదించింది. | Having written novels, she earned ten thousands. |
| వాడు జవాబులు రాయకుండా దిక్కులు చూశాడు. | He looked this way and that way without writing the answers. |
| పుస్తకం అక్కడ పెట్టి వెళ్ళండి. | Please keep the book there and go! |
| అతను ఫైళ్ళు బీరువాలో పెట్టకుండా వెళ్ళాడు. | He went away without keeping the files in the almirah. |

| | |
|---|---|
| ఆయన వచ్చి కూర్చున్నారు. | He came and sat down |
| నేను పుస్తకం కొని తెచ్చాను. | I bought the book and brought with me. |
| ఆమె ఊరికి వెళ్ళి వచ్చింది. | She had been (went and returned) to the town. |
| వారు భోంచేసి నిద్రపోయారు. | Having taken food, he slept. |
| అతను పని చేసిచేసి అలిసిపోయాడు | Having worked continuously, he got tired. |
| వాడు తాగితాగి నేలమీద పడ్డాడు. | Having drunk continuously he fell down on the ground. |
| పిల్లలు ఆడిఆడి ఇళ్ళకు వెళ్ళారు. | Having played continuously, the children went home. |
| నీ కోసం చూసిచూసి వెనక్కివచ్చాను. | Having looked for you continuously, I came back. |
| అతను కాకినాడ చూసి వచ్చాడు. | He visited Kakinada and returned. |
| ఆమె నన్ను చూడకుండా వెళ్ళిపోయింది. | She went away without seeing me. |
| ఆయనకు నీ విషయం చెప్పివచ్చాను. | I told him your matter and returned. |
| నాతో చెప్పకుండా వెళ్ళకు ! | Don't go without telling me ! |
| ఈ పుస్తకం చదివి అభిప్రాయం చెప్పండి. | Please read this book and tell me your opinion. |
| మేము హైదరాబాదువచ్చి సుమారు పాతిక సంవత్సరాలు అయింది. | It is approximately twenty five years since we came to Hyderabad. |
| మా ఇంటికి రాకుండా వెళ్ళకండి. | Please don't go without coming to my house, |

| | |
|---|---|
| ఆ పుస్తకం ఆయన్ని అడిగి తీసుకు వెళ్ళండి. | Please ask for the book and take from him. |
| అతను నన్ను డబ్బు అడక్కుండా వెళ్ళిపోయాడు. | He went away without asking me for money. |
| ఆమెను పిలిచి ఈ సంగతి చెప్పు. | You call her and tell her this matter. |
| ఆవిడ నన్ను పిలవకుండా పేరంటానికి వెళ్ళింది. | She went to attend perantam (haldi-kumkum) without calling me. |
| సీతమ్మగారిని కలిసి వచ్చాను. | I met Seetamma and returned. |
| సుందరయ్యగారిని కలవకుండా వచ్చాను. | I returned without meeting Mr. Sundarayya. |
| వాడు పరీక్షకు కూర్చుని వచ్చాడు. | He sat for the examination and returned. |
| ఆమె పరీక్షకు కూర్చోకుండా వచ్చింది. | She returned without sitting for the examination. |

# LESSON 15

| | |
|---|---|
| చెప్పు 'tell' | చెప్పించు 'make one tell' |
| చదువు 'read/study' | చదివించు 'make one read/study |
| తిను 'eat' | తినిపించు 'make one eat' |
| చేయు 'do' | చేయించు 'make one do' |
| చూచు 'see' | చూపించు 'make one see, show' |
| వచ్చు 'come' | రప్పించు 'make one come' |
| ఉండు 'be' | ఉంచు 'keep/retain' |
| నేర్చు(కొను) 'learn (for oneself)' | నేర్పు 'teach' |
| చేత 'by' | గురించి 'about' |
| అతను మీ గురించి నాకు చెప్పాడు. | He told me about you. |
| అతను మీ గురించి రాఘవరావుచేత నాకు చెప్పించాడు. | He made Raghavarao tell me about you. |
| ఆవిడ పత్రిక చదువుతోంది. | She is reading a magazine. |
| ఆమె కూతురిచేత పాఠం చదివిస్తోంది. | She is making her daughter read the lesson. |
| నేను అన్నం తింటున్నాను. | I am eating food. |
| మా ఆవిడ పాపకు అన్నం తినిపిస్తోంది. | My wife is feeding (female) baby. |
| నేను టీ.వీ. చూస్తున్నాను. | I am watching T.V. programme. |

| | |
|---|---|
| మా చుట్టాలకు హైదరాబాదు చూపిస్తున్నాము. | We are showing Hyderabad to our relatives. |
| శేఖర్ ఇక్కడికి వస్తాడు | Sekhar will come here. |
| శేఖర్ సుందరాన్ని ఇక్కడికి రప్పిస్తాడు. | Sekhar will make Sundaram come here. |
| అతను పని చేస్తున్నాడు. | He is doing the work. |
| ఆయన అతనిచేత పని చేయిస్తున్నారు | He is getting the work done by him. |
| మీ పుస్తకం ఇక్కడ ఉంది. | Your book is here. |
| మీ పుస్తకం ఇక్కడ ఉంచాను | I have kept (retained) your book here. |
| నేను తెలుగు నేర్చుకొన్నాను (నేర్చాను). | I learned Telugu. |
| నేను వాళ్ళకు తెలుగు నేర్పాను. | I taught them Telugu. |
| నేను బందరునుంచి లడ్డూలు తెచ్చాను. | I brought laddus from Machilipatnam. |
| మేం సుబ్బయ్యచేత బెజవాడనుంచి మామిడిపళ్ళు తెప్పించాం. | We got Subbayya bring mango fruits from Bezwada (Vijayawada). |

ACC NO. 12677
9=40
494.8138
DAK

| | |
|---|---|
| చదవగలను* 'I can read' | చదవలేను 'I cannot read' |
| రాయగలం 'we can write' | రాయలేం 'we cannot write' |
| వెళ్ళగలవు 'you can go' | వెళ్ళలేవు 'you cannot go' |
| ఇయ్యగలరు 'you can give' | ఇయ్యలేరు 'you cannot give' |

---

* *tsadav-* is an alternant of *tsaduvu* 'read' that occurs before the infinitive suffix -*a*(*n*)-. Hence, *tsadav* + *an* = *tsadavan-*. '*-kala*' denotes ability to do a thing. Normally, when the final *n* of the infinitive form is lost, the following *k*/*c*/*T*/*t*/*p* becomes *g*/*j*/*D*/*d*/*b*. Hence, *tsadav*+a(n)+kala=*tsadavagala*. When the personal suffix (I person, singular) is added, it becomes *tsadavagalanu*.

| | |
|---|---|
| రాగలడు 'he can come' | రాలేడు 'he cannot come' |
| చెయ్యగలదు 'she can do' | చెయ్యలేదు 'she cannot do' |
| కొనగలరు '(they) can buy' | కొనలేరు '(they) cannot buy' |
| ఒంటరిగా | 'alone' |
| నేను తెలుగు చదవగలను. | I can read Telugu. |
| నేను ఒరియా చదవలేను. | I cannot read Oriya. |
| మనం ఇంగ్లీషులో రాయగలం. | We (incl.) can write in English. |
| మేం హిందీలో రాయలేం. | We (excl.) cannot write in Hindi. |
| నువ్వు ఒంటరిగా వెళ్ళగలవు. | You can go alone. |
| నువ్వు సైకిలుమీద వెళ్ళలేవు. | You cannot go on a cycle. |
| మీ రామెకు ఉద్యోగం ఇయ్యగలరు. | You can give her a job. |
| మీరు నాకు వంద రూపాయలు ఇయ్యలేరు. | You cannot give me hundred rupees. |
| అతను ఆరుగంటలకు రాగలడు. | He can come by six o' clock. |
| వాడు టాక్సీలో రాలేడు. | He cannot (afford to) come by a taxi. |
| మల్లిక ఈ పని చెయ్యగలదు. | Mallika can do this work. |
| శారద ఆ పని చెయ్యలేదు*. | Sarada cannot do that work. |
| వాళ్ళు ఈ ఇల్లు కొనగలరు. | Those people can buy this house. |

---

* Elsewhere, "శారద ఆ పని చెయ్యలేదు" means, 'Sarada did not do that work', as opposed to "శారద ఆ పని చేసింది."

| | |
|---|---|
| వీళ్ళు ఆ ఇల్లు కొనలేరు. | These people cannot buy that house . |
| మనం ఆరుగంటలకు వెళ్ళగలం. | We can go by sixo' clock. |
| అతను ఐదో తేదీవరకు రాలేడు. | He cannot come till the fifth. |
| మనం ఇవాళ సినిమా చూడగలం. | We can see a movie today. |
| మనం రేపు సినిమా చూడలేం. | We cannot see a movie tomorrow. |
| తిను 'eat' | తినబోవు* 'be about to eat' (going to eat) |
| పోవు 'go' | |
| చూచు 'see' | చూడగలుగు* 'be able to see' |
| కలుగు 'be able' | |
| రాజారావు అన్నం తినబోతున్నాడు. | Rajarao is about to take his food. |
| రంగానాథం చీకట్లో చూడగలిగాడు. | Ranganatham could see in darkness, |
| నేను మీ విషయం అడగబోయాను. | I was about to ask your matter. |
| స్టేషనుకు తొందరగా చేరగలుగుతాం. | We will be able to reach the station quickly. |
| ఆమె లోపలికి రాబోయింది. | She was about to come in. |
| నే నా మాట చెప్పబోయాను. | I was about to tell that matter. |
| చదువుకోగలుగు | 'be able to read for oneself' |
| రాసుకోలేకపోవు | 'be unable to write for oneself' |
| పరిగెత్తుకొని పారిపోవు | 'run away' |

---

* *tin+an → tinan+poovu = tinaboovu.* The auxiliary verb 'poovu' is added to the infinitive form. *tsuuD+an → tsuuDan+kalugu= tsuuDagalugu. tsuuDan* - is the infinitive form of the root *tsuutsu* 'see'. *-n-* followed by *-p/-k* is lost and *-p/-k* becomes *-b/-g.*

| | |
|---|---|
| పరిగెత్తుకొని పారిపోలేకపోవు | 'be unable to run away (to escape)' |
| వాడు నా ఉత్తరం చదువుకో గలిగాడు. | He was able to read my letter himself. |
| వాడు నా ఉత్తరం చదువుకోలేక పోయాడు. | He was not able to read my letter himself. |
| నేనీ రోజు ఇరవై పేజీలు రాసుకో గలిగాను. | I was able to write twenty pages today. |
| నిన్న ఒక్క పేజీకూడా రాసుకోలేక పోయాను. | I was not able to write even a single page yesterday. |
| మా అబ్బాయి పరిగెత్తుకొని పారి పోయాడు. | My son has run away. |
| దొంగ పరిగెత్తుకొని పారిపోలేక పోయాడు. | The thief was not able to run away. |
| చెప్పనిచ్చు* | 'allow one to speak' |
| వెళ్ళనిచ్చు/పోనిచ్చు | 'allow one to go' |
| చూడనిచ్చు | 'allow one to see' |
| రానిచ్చు | 'allow one to come' |
| ఇయ్యనిచ్చు/ఇవ్వనిచ్చు | 'allow one to give' |
| అతన్ని చెప్పనియ్యండి. | Let him speak. |
| వాణ్ణి చెప్పనియ్యకండి. | Let him not tell. |
| నన్ను ఈరోజు వెళ్ళనియ్యి. | Let me go today. |
| ఆయన్ని ఈరోజు వెళ్ళనియ్యకు. | Don't allow him to go today. |

* *cepp + an + itstsu = ceppanitstsu; poo + (a)n + itstsu = poonitstsu.*

| | |
|---|---|
| ఆమెను ఇల్లు చూడనిచ్చాను. | I allowed her to see the house. |
| నన్ను పుస్తకం చూడనియ్యలేదు. | I was not allowed to see book. |
| అతనికి నూరు రూపాయిలు ఇయ్యనిచ్చాను. | I allowed (one) to give him hundred rupees. |
| నేను ఒక్క రూపాయికూడా ఇయ్యనియ్యలేదు. | I did not allow (one) to give even a single rupee, |
| చెప్పవచ్చు* (చెప్పొచ్చు) 'may tell' | చెప్పకపోవచ్చు 'may not tell' |
| రావచ్చు 'may come' | రాకపోవచ్చు 'may not come' |
| వినవచ్చు (వినొచ్చు) 'may hear' | వినకపోవచ్చు 'may not hear' |
| ఉండవచ్చు (ఉండొచ్చు) 'may be/stay' | ఉండకపోవచ్చు/లేకపోవచ్చు 'may not be (available)/stay' |
| కుర(వ)వచ్చు 'may rain' (కురవొచ్చు) | కురవకపోవచ్చు 'may not rain' |
| అతను మీకీ మాట చెప్పవచ్చు. | He may tell you this matter. |
| ఆయన నిజం చెప్పకపోవచ్చు. | He may not tell the truth. |
| ఆమె ఈరోజు మీ ఇంటికి రావచ్చు. | She may come to your house today. |
| నే నీ రోజు సినిమాకి రాకపోవచ్చు. | I may not come to see the picture today. |
| అతను ఇంటి దగ్గిర ఉండొచ్చు. | He may stay home (He may be available at home). |
| నీ దగ్గిర డబ్బు లేక(ఉండక)పోవచ్చు. | You may not have money with you. |

* In the context, *vatstsu* denotes probability, *nuvvu ceppotstsu* = there is a probability of your saying.

| | |
|---|---|
| ఆమె ఇప్పుడు రావచ్చు. | She may come now. |
| ఈరోజు వాన కుర(వ)వచ్చు. | It may rain today. |
| ఈరోజు వాన కురవకపోవచ్చు. | It may not rain today. |
| శాంతమ్మగారు రేపు ఊరికి వెళ్ళొచ్చు. | Mrs./Miss Santamma may leave the station tomorrow. |
| అతను రేపు వరంగల్లు వెళ్ళక పోవచ్చు. | He may not leave for Warangal tomorrow. |
| ఆయన ఈ సంగతి భార్యతో చెప్పొచ్చు. | He may relate this matter to his wife. |
| ఆవిడ ఇరుగుపొరుగువాళ్ళకు తప్పకుండా చెప్పొచ్చు. | She may relate (this matter) to the neighbours, without fail. |
| చెప్పవచ్చు* (చెప్పొచ్చు) '(you) may/can tell' | చెప్పగూడదు 'you should not tell' |
| రావచ్చు 'may come' | రాగూడదు 'should not come' |
| వినవచ్చు (వినొచ్చు) 'may hear' | వినగూడదు 'should not hear' |
| ఉండవచ్చు (ఉండొచ్చు) 'may stay/have' | ఉండగూడదు 'should not stay/have' |
| ఇయ్యవచ్చు(ఇయ్యొచ్చు)/ ఇవ్వవచ్చు (ఇవ్వొచ్చు) 'may give' | ఇయ్యగూడదు/ఇవ్వగూడదు 'should not give' |
| మీ రా మాట అతనికి చెప్పవచ్చు. | You may tell that matter to him. |
| మీ రీ రహస్యం చెప్పగూడదు. | You should not tell this secret. |

---

* In this context, *vatstsu* denotes *permission*, *nuvvu ceppavatstsu* = you are permitted to say.

| | |
|---|---|
| రేపు నువ్వు రావచ్చు. | You may come tomorrow. |
| అనుమతి తీసుకోకుండా లోపలికి రాగూడదు. | One should not come in without taking permission. |
| నువ్వు నీ భార్యమాట వినొచ్చు. | You may heed to the advice of your wife. |
| మీ రతని మాట వినగూడదు. | You should not heed to his advice. |
| మీ రీ గదిలో ఉండొచ్చు. | You may stay in this room. |
| మీ రా ఇంట్లో ఉండగూడదు. | You should not stay in that house. |
| ఇతనికి ప్రమోషను ఇయ్యవచ్చు. | He may be given promotion. |
| వాడికి డబ్బు ఇయ్యగూడదు. | He should not be given money. |
| ఏమండీ ! లోపలికి రావచ్చా ? | Hello ! May I (we) come in ? |
| రండి, రండి ! కూర్చోండి. | Please come in ! Please sit down. |
| నాగేశ్వరరావుగారు ఇంకా రాలేదా ? | Hasn't Mr. Nageswararao arrived yet ? |
| లేదండి. పది పదిహేను నిమిషాల్లో రావచ్చు. | No Sir (Madam) ! He may come in ten or fifteen minutes. |
| ఇక్కణ్ణించి వాళ్ళింటికి ఫోన్ చెయ్యొచ్చా ? | Could I (we) ring up to his house, from here ? |
| చెయ్యొచ్చు కాని, ఈపాటికి ఆయన దార్లో ఉండొచ్చు. | You may ring up. But he might be on his way now. |
| ఈ విషయం ఆయనకు చెప్పొచ్చా ? | Could we relate this matter to him ? |
| పరవాలేదు. ఆయన అభిప్రాయం కూడా తెలుసుకోవచ్చు. | Doesn't matter. We could know his opinion also. |
| ఆయన సలహా అడగొచ్చా ? | Could I ask his advice ? |

| | |
|---|---|
| తప్పేముంది? సలహా తీసుకోవచ్చు. | There is nothing wrong in it. You could take his advice. |
| వస్తే 'if (one) comes' | రాకపోతే 'if (one) does not come' |
| ఉంటే 'if (one) has/stays | లేకపోతే/ఉండకపోతే 'if one does not have/stay' |
| నువ్వు వస్తే పుస్తకం ఇస్తాను. | If you come, I will give the book. |
| నువ్వు రాకపోతే పుస్తకం ఇయ్యను (ఇవ్వను). | If you do not come, I will not give the book. |
| ఆయన దగ్గర డబ్బు ఉంటే ఇస్తారు | If he has money, he will give (you). |
| ఆయన దగ్గర డబ్బు లేకపోతే ఇయ్యరు. | He will not give (you)money if he does not have. |
| మీరు అడిగితే నేను చెబుతాను. | If you ask me, I will tell you (reply) |
| మీరు అడక్కపోతే (అడగకపోతే) చెప్పను. | If you do not ask me. I will not tell, |
| నేను ఉత్తరం రాస్తే జవాబు వస్తుంది. | I will get a reply if I write a letter. |
| నేను ఉత్తరం రాయకపోతే జవాబు రాదు. | I will not get a reply if I don't write a letter. |
| బొంబాయి వస్తే మీ ఇంటికి వస్తాను. | If I come to Bombay, I will come to your house. |
| మీరు హైదరాబాదు రాకపోతే నేను బొంబాయి రాను. | If you will not come to Hyderabad, I will not come to Bombay. |
| కష్టపడి పనిచేస్తే పైకి వస్తాం. | We will come up, if we work hard. |
| కొందరు పలుకుబడివల్ల కూడా పైకి వస్తారు. | Some people come up by their influence also. |

# LESSON 16

| | |
|---|---|
| చదివినా 'even if one reads' | చదవకపోయినా 'even if one does not read' |
| ఉన్నా 'even if one has' | లేకపోయినా 'even if one does not have' |
| వెళ్ళినా 'even if one goes' | వెళ్ళకపోయినా 'even if one does not go' |
| తిన్నా 'even if one eats' | తినకపోయినా 'even if one does not eat' |
| వచ్చినా 'even if one comes' | రాకపోయినా 'even if one does not come' |
| పాఠం చదివినా నాకు అర్థం కాలేదు. | The lesson was not understood by me, even though I read (it). |
| ఆమె కాలేజిలో చదవకపోయినా ఇంగ్లీషు బాగా రాస్తుంది. | She writes good English even though she did not study in a college. |
| ఆయన దగ్గిర డబ్బు ఉన్నా ఇవ్వరు. | He does not give money, even if he has. |
| ఆవిడ దగ్గిర డబ్బు లేకపోయినా, అప్పుచేసి ఇచ్చింది. | Even though she did not have money, she borrowed (from somebody) and gave (me). |
| మీరు వెళ్ళినా నేను రాను. | Even if you go (there) I will not come. |
| నేను వెళ్ళకపోయినా ఆయన వచ్చారు. | Even though I did not go (to him), he came (to my place). |

| | |
|---|---|
| పొద్దున అన్నం తిన్నా మళ్ళీ ఆకలి వేస్తోంది. | Even though I took my meal in the morning, I feel hungry again. |
| అతను అన్నం తినకపోయినా పని చేస్తాడు. | Even if he does not take food, he works. |
| నేను వచ్చినా పని కాదు. | Even if I come (there), the work will not be done. |
| రాధ రాకపోయినా నేను వెళ్తాను. | Even if Radha does not come, I will go (there). |
| మేం పిలిచినా వాళ్ళు రాలేదు. | They did not come, even though we invited them. |
| నేను చెప్పినా మీరు వినలేదు. | You did not hear me, even though I told you. |
| లోభిని అడిగినా లాభంలేదు. | Even if we ask a miser (for money) there will not be any use. |
| మిమ్మల్ని చూసినా వాడు మాట్లాడడు. | He does not speak to you, even if he sees you. |
| "ఎంత నేర్చినా కాంత దాసులే!" | Even after learning to a great extent, men are slaves of women (their wives). |
| వాడు చదవకపోయినా పరీక్షకు కూర్చున్నాడు. | He sat for the examination, even though he did not study, |
| ఆయన దగ్గిర డబ్బు లేకపోయినా నాకు సహాయం చేశారు. | He helped me, even though he did not have money. |
| వాళ్ళు పిలవకపోయినా వచ్చారు. | They attended (to the function), even though they were not invited. |
| మీరు నన్ను చూడకపోయినా నేను మిమ్మల్ని చూశాను. | I saw you (there), even though you did not see me. |
| ఆమె రాకపోయినా ఈమెను పంపిస్తుంది. | Even though she will not come, she will send this (female) person. |

# LESSON 17

| | |
|---|---|
| చూసిన* | 'that is (was/are/were) seen' |
| చదివిన | 'that is (was/are/were) read' |
| విన్న | 'that is (was/are/were) heard' |
| చెప్పిన | 'that is (was/are/were) told' |
| ఇది నేను చూసిన సినిమా. | This is a picture I saw. |
| అది మీరు చదివిన పుస్తకం. | That is a book you read. |
| ఇది నేను విన్న పాట. | This is a song I heard. |
| అది ఆమె చెప్పిన విషయం. | That Is a matter she said. |
| ఆయన నాకు తెలిసిన వ్యక్తి. | He is a person I know. |
| గుంటూరు నేను వెళ్ళిన ఊరు. | Guntur is a town I visited. |
| ఇవి మా దొడ్లో పూసిన పూలు. | These are the flowers, flowered in our court-yard. |
| అవి గద్వాలలో కొన్న చీరలు. | Those are the sarees bought in Gadwal. |
| వీళ్ళు మిమ్మల్ని ఎరిగిన పిల్లలు. | These are the children that know you. |

---

* The verbal adjective form in the past tense *'tsuusina'*, is composed of a base (*tsuus-*) and a suffix (*-ina*). The initial vowel of the suffix (*-i-*) is lost when it is preceded by a base ending in *-n-*. Hence, *vin-na, kon-na, tin-na, an-na, uṇ-ṇa*.

| | |
|---|---|
| మీరు రాసిన ఉత్తరం నాకు అందలేదు. | The letter you wrote, was not received by (reached) me. |
| మీరు పంపిన ఫైలు డైరక్టర్ గారి దగ్గిరే ఉంది. | The file you sent, is with the director himself. |
| ఆయన బదిలీ అయిన ఊరు ఆదిలాబాదు. | The town he is transferred to, is Adilabad. |
| ఆమె పాడిన పాట త్యాగరాజకీర్తన. | The song she sang, was Tyagaraja Kirtana. |
| ఆ బొమ్మ వేసిన కళాకారుడు రాజయ్యగారు. | The artist that has drawn that picture, is Mr. Rajayya. |
| ఆయన కొన్న పుస్తకం ప్రతాపరెడ్డి గారు వ్రాసిన పుస్తకం. | The book he purchased, is a book written by Mr. Prataparedd i. |
| తిరుపతి కొండమీద ఉన్న గుడి వెంకటేశ్వరస్వామి గుడి. | The temple situated on the top of the Tirupati hill, is of Venkateswara Swami. |
| మనకు కాఫీ ఇచ్చిన అమ్మాయి మా రెండో అమ్మాయి. | The girl that has given us coffee, is my second daughter. |

| POSITIVE | | NEGATIVE |
|---|---|---|
| చదివిన | × | చదవని* |
| విన్న | × | వినని |
| చెప్పిన | × | చెప్పని |

* *tsadavani* (*tsadav+ani*) is a verbal (past tense) adjective that gives a negative meaning. The initial vowel of the suffix *-ani* is lost when it is preceded by a monosyllablic base ending in a long vowel. Hence, *kaa+(a)ni = kaani*; *raa+(a)ni=raani*; *poo+(a)ni =pooni*,

| | | |
|---|---|---|
| చూసిన | × | చూడని |
| అయిన | × | కాని |

| | |
|---|---|
| ఈ పుస్తకం నేను చదివాను. | I read this book. |
| ఇది నేను చదివిన పుస్తకం. | This is a book I read. |
| ఈ పుస్తకం నేను చదవలేదు. | I did not read this book. |
| ఇది నేను చదవని పుస్తకం. | This a book I did not read. |
| ఆ పాట నేను విన్నాను. | I heard that song. |
| అది నేను విన్న పాట. | That is a song I heard. |
| ఆ పాట నేను వినలేదు. | I did not hear that song. |
| అది నేను వినని పాట. | That is a song I did not hear. |
| ఇది ఆయన చెప్పిన విషయం. | This is a matter he mentioned. |
| ఇది ఆయన చెప్పని విషయం. | This is a matter he did not mention. |
| అది నేను చూసిన ఊరు. | That is a town I have seen. |
| అది నేను చూడని ఊరు. | That is a town I have not seen. |
| ఇది అయిన పని. | This is the work that is done. |
| ఇది కాని పని. | This is the work that is not done. |
| వచ్చే | 'the person or thing that comes; ensuing' |
| వెళ్ళే | 'the person or thing that goes' |

---

* The suffix *-ee* is added to the verbal base in the future-habitual tense, to make it a verbal adjective.

| | |
|---|---|
| చదివే | 'that is going to be read by; the person that reads' |
| చూసే | 'that is going to be seen; the person that sees' |
| తరచుగా 'frequently' | అరుదుగా 'rarely' |
| రేపు పనిలోకి వచ్చే మనుషులు ముగ్గురు | The persons who are come tomorrow to do the work, are three. |
| నేను వచ్చే వారం ఢిల్లీ వెళ్తాను. | I will go to Delhi in the next (coming) week. |
| స్టేషనుకు వెళ్ళే బస్సు ఇంకొక అరగంటలో వస్తుంది. | The bus that goes to the station will arrive in (another) half an hour. |
| ఆయన ఎల్.టి.సి. మీద వెళ్ళే ఊరు పాలమూరు. | The town he visits on L.T.C. (Leave Travel Concession) is Palamuru. |
| మనం చదివే పాఠం పదిహేడో పాఠం. | The lesson we read is the seventeenth lesson. |
| అతను చదివే పుస్తకాలు తెలుగు నవలలు. | The books he reads are Telugu novels. |
| మనం రేపు చూసే సినిమా హిందీ సినిమా. | The movie we see tomorrow is a Hindi movie. |
| ఆమె తరచుగా చూసే సినిమాలు ఇంగ్లీషు సినిమాలు. | The movies she frequently sees are English movies. |
| లక్ష్మి వెళ్ళే ఊరు రాజమండ్రి. | The town Lakshmi visits, is Rajahmundry. |
| మా ఇంట్లో ఉండే అబ్బాయి మా మేనల్లుడు. | The boy that stays in my house is my nephew (sister's son). |
| వాడు తినే పండు మామిడి పండు. | The fruit he eats is a mango fruit. |

| | |
|---|---|
| ఆమె పాడే పాటలు రామదాసు కీర్తనలు. | The songs she sings are Ramadasu's songs (composed by Ramadasu in praise of Lord Rama etc.) |
| యాదగిరి చదివే పుస్తకం పోతన భాగవతం. | The book Yadagiri reads is Potana's Bhagavatam. |
| వాళ్ళు ఉండే ఇల్లు అమీర్ పేటలో ఉంది. | The house in they reside in, is in Ameerpet. |
| నేను చెప్పేమాట శ్రద్ధగా వినండి. | Please listen to my word carefully. |
| వాళ్ళు కొనే ఇల్లు అబ్దుల్ గఫూర్ గారి ఇల్లు. | The house they purchase, belongs to Mr. Abdul Gafoor. |
| వస్తున్న | 'the person or thing that is (was/are/were) coming' |
| వెళ్తున్న | 'the person or thing that is (was/are/were) going. |
| చదువుతున్న | 'The person that is reading or studying; the thing that is being read |
| చూస్తున్న | 'the person that is seeing; the thing or person that is being seen' |
| వింటున్న | 'the person that is hearing; the thing that is being heard' |
| ఇటు వస్తున్న కారు మా డైరక్టరు గారి కారు. | The car coming this way, is our Director's car. |
| అటు వెళ్తున్న పిల్లవాడు మా అన్నయ్య కొడుకు. | The boy going that way is my elder brother's son. |
| మనం వెళ్తున్న బస్సు సూపర్ డీలక్సు. | The bus we are travelling in, is a Super Deluxe bus. |
| నేను వెళ్తున్న పని చాలా తొందరపని. | The work on which I am going, is an urgent work. |

| | |
|---|---|
| ఆ ఉత్తరం చదువుతున్న వ్యక్తి.... ప్రకాశం. | The person reading that letter, is Prakasam. |
| అనసూయ చదువుతున్న పుస్తకం పెరల్ బక్ నవల. | The book Anasuya is reading, is a novel written by Pearl S. Buck. |
| ఆ కిటికీలో నుంచి చూస్తున్న ముసలాయన మా తాతగారు. | The old man looking through the window is my grand-father. |
| మనం చూస్తున్న సినిమా కన్నడ సినిమా. | The movie we are seeing, is a Kannada movie. |
| మా ఇంటికి వస్తున్న పత్రిక ఆంధ్ర పత్రిక. | The paper coming to our house, is Andhra Patrika. |
| నేను రాస్తున్న ఉత్తరం రంగనాథానికి. | The letter I am writing, is to Ranganatham. |
| మీరు వింటున్న పాట ఘంటసాలది. | The song you are listening to, is of Ghantasala (Venkateswarrao). |
| మీరు చేస్తున్న పని ఏమిటి ? | What is the work you are doing ? |
| ఆయన ఇస్తున్న డబ్బు ఎంత ? | How much money is he giving ? |
| వాళ్ళు కోస్తున్న పువ్వులు మల్లె పువ్వులు. | The flowers they are plucking, are jasmine flowers. |

# LESSON 18

| వచ్చిన | | వస్తున్న | | వచ్చే | |
|---|---|---|---|---|---|
| వచ్చినది | వచ్చినవి | వస్తున్నది | వస్తున్నవి | వచ్చేది | వచ్చేవి |
| వచ్చినవాడు | | వస్తున్నవాడు | | వచ్చేవాడు | |
| వచ్చినతను | | వస్తున్నతను | | వచ్చేఅతను | |
| వచ్చినాయన | వచ్చిన | వస్తున్నాయన | వస్తున్న | వచ్చేఆయన | వచ్చే |
| వచ్చినవారు | వాళ్ళు | వస్తున్నవారు | వాళ్ళు | వచ్చేవారు | వాళ్ళు |
| వచ్చినామె | | వస్తున్నామె | | వచ్చేఆమె | |
| వచ్చినావిడ | | వస్తున్నావిడ | | వచ్చేఆవిడ | |

ఇప్పుడు వచ్చిన బస్సు చార్మినార్ బస్సు. — The bus that has now come is Charminar bus.

ఇప్పుడు వచ్చినది (వచ్చింది) చార్మినార్ బస్సు. — The one that has come now is Charminar bus.

ఇప్పుడు వస్తున్న బస్సు చార్మినార్ బస్సు. — The bus that is coming now is Charminar bus.

ఇప్పుడు వస్తున్నది చార్మినార్ బస్సు. — The one that is coming now is Charminar bus.

ఇప్పుడు వచ్చే బస్సు చార్మినార్ బస్సు. — The bus that is going to come now is Charminar bus.

ఇప్పుడు వచ్చేది చార్మినార్ బస్సు. — The one that is going to come now is Charminar bus.

| | |
|---|---|
| ఇప్పుడు వచ్చినవి చార్మినార్ బస్సులు. | The buses that have come now are Charminar buses. |
| ఇప్పుడు వస్తున్నవి చార్మినార్ బస్సులు. | The buses that are coming now are Charminar buses. |
| ఇప్పుడు వచ్చేవి చార్మినార్ బస్సులు. | The buses that are going to come now are Charminar buses. |
| ఆ పేపరు నేను చదివినది (చదివింది). | That is a paper I read. |
| ఈ ఉత్తరాలు ఆయన చదివినవి. | These are the letters he read. |
| నిన్న మీ ఇంటికి వచ్చినవాడు మా అబ్బాయి. | The person came to your house yesterday was my son. |
| గదిలో వీణ వాయిస్తున్నది మా అమ్మాయి. | The person playing on veena in the room, is my daughter. |
| నిన్ను పిలిచినాయన రంగారావుగారు. | The person called for you is Mr. Rangarao. |
| అతనితో మాట్లాడుతున్నామె అతని స్నేహితురాలా ? | Is the (female) person talking with him, his girl friend ? |
| మా ఇంట్లో వంటచేసేఆవిడ ముసలావిడ. | The person that cooks in my house is an old woman. |
| ఆ ఉత్తరాలు కమల రాసినవి. | Those are the letters written by Kamala. |
| నువ్వు నేర్చుకుంటున్న భాష మలయాళం కాదు; కదూ ? | The language that you are learning is not Malayalam; is it? |
| మా అమ్మాయితో ఆడేవాళ్ళు మా పక్కింటివాళ్ళ పిల్లలు. | Those that are playing with my daughter, are my neighbour's children. |

| | |
|---|---|
| ఈ పుస్తకం రాసినతను నా స్నేహితుడు. | The (male) person that has written this book is a friend of mine. |
| మా ఆఫీసులో పనిచేసేవాళ్ళందరూ తెలుగువాళ్ళు కాదు. | All the persons that work in my office are not Telugu people. |
| ఉన్న ఊరు కన్నతల్లి లాంటిది. | The place (town) where one lives is like one's own mother. |
| అడిగేవాడికి చెప్పేవాడు లోకువ. | The one who answers, is inferior to the one who asks questions. |
| చేసిన పాపం చెబితే పోతుంది. | One is redeemed of his sin if one confesses it. |
| ఈ పుస్తకం నేను చదవనిది. | This is the book I did not read. |
| ఆ పాటలు మీరు విననివి. | Those are the songs you did not listen to. |
| చూడనిదాన్ని చెప్పగూడదు. | One should not relate a thing that one did not see. |
| మనకు ఎదురుగా వస్తున్నాయన ఒక రచయిత. | The person coming in the opposite direction is a writer. |
| వాళ్ళింట్లో పనిచేస్తున్నవాడు ఒక పంజాబీ కుర్రవాడు. | The person working in their house is a Punjabi boy, |
| ఇప్పుడు పాట పాడుతున్నది శాంత. | The person singing a song now is Santa. |
| నాకు ఉద్యోగం ఇచ్చినాయన ఒక మహమ్మదీయుడు. | The person who gave me job was a mohammedan: |
| అక్కడ అల్లరి చేస్తున్నవాళ్ళు మా పిల్లలు. | Those that are making noise there, are my children. |
| ఆమధ్య మీరు కొన్నది ధర్మవరం పట్టుచీర కదూ ? | The one that you bought sometime back, was a Dharmavaram silk saree: wasn't it? |

| | |
|---|---|
| నేను మాధవికి ఇచ్చినవి చాలా మంచి పుస్తకాలు. | Those that were given by me to Madhavi were very good books. |
| అక్కడ కూర్చున్నతను సత్యమూర్తి. | The person sat there was Satyamurti. |
| కారులో వెళ్తున్నవారు మనోహర్ రావు గారు. | The person going in the car is Mr. Manohar Rao. |
| మనం నేర్చుకొంటున్న భాష, సుమారు ఐదు కోట్లమంది మాట్లాడేది. | The language we are learning is the one spoken by about five crores of people. |
| వచ్చినప్పుడు | 'when one came' |
| వచ్చే(ట)ప్పుడు | 'when one comes/is going to come' |
| వస్తున్నప్పుడు | 'when one is (was) coming' |
| మీరు వచ్చినప్పుడు నేను ఇంట్లోలేను. | I was not at home when you came. |
| నేను అమలాపురం నుంచి వచ్చేటప్పుడు మంచి పనసపళ్ళు తెస్తాను. | I shall bring good jack fruits when I come from Amalapuram. |
| నేను ఆఫీసుకు వస్తున్నప్పుడు బస్సు చెడిపోయింది. | The bus had failed while I was coming to the office. |
| నేను పిలిచినప్పుడు నువ్వు రాలేదేం ? | Why did you not come when I called for you? |
| అతను వెళ్ళేటప్పుడు మా అబ్బాయికి వంద రూపాయలు ఇచ్చాడు. | He gave hundred rupees to my son while he was leaving. |
| రాస్తున్నప్పుడు స్పష్టంగా రాయాలి. | One should write legibly while writing. |
| నేను సినిమాకు వెళ్ళినప్పుడు హాలులో 'మాజా' తాగాను. | I drank 'Maaza' when I went to (see) a movie. |

| | |
|---|---|
| మనం బజారుకు వెళ్ళేటప్పుడు అరుణనుకూడా పిలుద్దాం. | Let us call Aruna also when we go to the market. |
| నాన్నగారు నిద్రపోతున్నప్పుడు గొడవ చెయ్యకూడదు. | One should not make noise when daddy is sleeping. |
| నీ దగ్గర డబ్బు లేనప్పుడు నువ్వు మాత్రం ఏం చేస్తావు ? | What do you do when you do not have money ? |
| అన్నం తినేటప్పుడు అన్ని మంచినీళ్ళు తాగడం ఎందుకు ? | Why should (you) drink so much water at the time of taking food? |
| వచ్చినందుకు | 'for having come (for the reason of coming)' |
| వచ్చే(ట)ందుకు | 'for coming (for the purpose of one's coming)' |
| వస్తున్నందుకు | 'for having been coming' |
| మీరు వచ్చినందుకు చాలా సంతోషం. | I am gald that you came. |
| నీతో వచ్చేటందుకు నాకు తీరిక లేదు. | I do not have leisure to come with you. |
| నువ్వు నాతో వస్తున్నందుకు ఆమెకు కోపంగా ఉంది. | She is angry that you are coming with me. |
| మీరు సహాయం చేసినందుకు చాలా థాంక్సు. | Many thanks to you for having helped (me). |
| నీ కిచ్చేటందుకు నా దగ్గర డబ్బులేదు. | I do not have money to give you. |
| కష్టపడి పని చేస్తున్నందుకు నాకు తృప్తిగా ఉంది. | I feel gratified for having been working hard. |

వచ్చినందువల్ల

| వచ్చే(ట)ందువల్ల | వస్తున్నందువల్ల |
|---|---|
| నేను వచ్చినందువల్ల లాభమేమిటి ? | What is the benefit of my coming ? |
| ఆమె వచ్చినందువల్ల నా పని పాడయింది. | My work has spoiled because of her arrival. |
| నువ్వు నాతో వచ్చేటందువల్ల అదనంగా వందరూపాయలు ఖర్చవుతాయి. | An extra expenditure of one hundred rupees will be incurred, because of your (proposed) journey along with me. |
| వాన వస్తున్నందువల్ల పిల్లలు బడికి వెళ్ళడంలేదు. | Children are not going to the school because it is raining. |
| అతను పదిసార్లు అడిగినందువల్ల ఈ విషయం చెప్పాను. | I told him this matter because he had (repeatedly) asked me many times. |
| నువ్వు వెళ్తున్నందువల్ల పని జరుగుతుంది. | The purpose will be served, since you are going. |
| మీరు అంతగా చెబుతున్నందువల్ల నేను చెయ్యగలిగిన సహాయం చేస్తాను. | Since you are telling so much, I shall help (you) to the best of my ability. |
| పని ఎక్కువగా ఉన్నందువల్ల విశ్రాంతి ఉండడం లేదు. | Since there is a lot of work, there is no rest. |
| ఉత్తరం రాసినందువల్ల పని జరిగింది. | The work was done because of writing a letter. |
| వాళ్ళమ్మాయికి పెళ్ళి నిశ్చయమయిందువల్ల, శాస్త్రిగారు నెల్లాళ్ళు సెలవు పెట్టారు. | Mr. Sastri has applied for leave for one month since his daughter's marriage has been fixed. |

| | |
|---|---|
| వాణ్ణి నమ్మినందువల్ల మోసం జరిగింది. | I was deceived since I believed him. |
| కరెంటు లేనందువల్ల పంకా తిరగడం లేదు. | The fan is not working because there is no current. |
| వచ్చినంత | వచ్చినన్ని |
| వచ్చే(ట)ంత | వచ్చేటన్ని |
| వస్తున్నంత | వస్తున్నన్ని |
| ఆయనకు వచ్చినంత లాభం నాకు రాలేదు. | I did not get as much profit as he got. |
| ఆమెకు వచ్చేటంత జీతం నాకు రాదు. | I do not get as much salary as she gets. |
| నాకు ఇప్పుడు వస్తున్నంత రాబడి కిందటి సంవత్సరం రాలేదు. | Last year I did not get as much income as I am getting now. |
| ఆమెకు వచ్చినన్ని పద్యాలు నాకు రావు/ఆమెకు వచ్చేటన్ని పద్యాలు నాకు రావు. | I do not know as many poems as she knows. |
| ఇప్పుడు వస్తున్నన్ని బస్సులు ఇంకో గంట తరవాత రావు. | After another half an hour, there will not be as many buses as there are coming now. |
| నువ్వు చేసినంత పని అతను చెయ్యలేడు. | He cannot do as much work as you do. |
| ఇప్పుడు సినిమాకు వచ్చేటంత తీరిక నాకు లేదు. | I do not have as much leisure as to come to see a movie. |
| నువ్వు చెప్పినంత చెడ్డవాడు కాదు అతను. | He is not as bad a person as you said. |
| ఆమె అడిగినన్ని పుస్తకాలు నేను ఇవ్వను. | I shall (do) not give as many books as she asks for. |

| | |
|---|---|
| ఆయన రాసినన్ని పుస్తకాలు ఎవరూ రాయలేదు. | None else has written as many books as he has written. |
| లతామంగేష్కర్ పాడినన్ని పాటలు ఎవరు పాడారు ? | Who else has sung as many songs as Lata Mangeshkar did? |
| నువ్వు కొన్నన్ని చీరలు ఆమె కొనదు. | She will not buy as many sarees as you bought. |
| అతను కడుపు పట్టినంత అన్నం తిన్నాడు. | He ate as much food as his stomach contained. |
| ఆవిడ ఇచ్చినంత డబ్బు తీసుకున్నాను. | I have taken as much money as she has given. |
| అతన్ని తిట్టేటంత అధికారం నీకు ఎవరిచ్చారు ? | Who gave the you authority to scold him? |

# LESSON 19

| | |
|---|---|
| చదివేవాడు | '*he* (intimate/inferior) used to read' |
| చదివేవారు | '*he/she/you* (formal/polite) used to read' |
| చదివేది | '*she* (intimate/inferior) used to read' |
| చదివేవాళ్ళు | '*those persons/you* (plural) used to read' |
| చదివేవాణ్ణి | '*I* used to read' |
| చదివేవాళ్ళం | '*we* used to read' |
| చదివేవాడివి | '*you* (intimate/inferior; masculine) used to read. |
| చదివేదానివి | '*you* (intimate/inferior; feminine) used to read' |
| ప్రసాద్ ఇంగ్లీషు పత్రిక చదివేవాడు. | Prasad used to read English news paper. |
| రామయ్యగారు పొద్దునే పొలానికి వెళ్ళేవారు. | Mr. Ramayya used to go to the (cultivating) field in the morning. |
| మా అమ్మ ప్రతి శుక్రవారం శ్రీ స్తూక్తంతో పూజ చేసేది. | My mother used to perform puja (worship) with 'Sriisuuktam' every Friday. |
| వాళ్ళ స్నేహితులు కన్నడం మాట్లాడేవాళ్ళు. | His (their) friends used to speak Kannada. |

| | |
|---|---|
| ఆయన రోజుకు ఐదుసార్లు నమాజు చేసేవారు. | He used to offer prayers five times a day. |
| నువ్వు డిటెక్టివ్ నవలలు బాగా చదివే వాడివి; కదూ? | You used to read a lot of detective novels; didn't you? |
| ఔను. గొప్ప రచయితలు రాసినవే చదివేవాణ్ణి. | Yes. I used to read only those that were written by great writers. |
| మేము చిన్నప్పుడు గోదావరిలో స్నానం చేసేవాళ్ళం. | We used to bathe in Godavari when we were young. |
| నువ్వు పాటలు బాగా పాడేదానివి. | You used to sing songs well. |
| పెళ్ళయిన కొత్తలో మా వారు రోజూ సాయంత్రం మల్లెపూలు తెచ్చేవారు. | My husband used to bring jasmine flowers every day in the evening, when we were newly married. |
| ఆ అమ్మాయిలు పాటలు చాలా బాగా పాడేవాళ్ళు. | Those girls used to sing songs very well. |
| మా తమ్ముడు సినిమాలు ఎక్కువగా చూసేవాడు. | My younger brother used to see a good number of movies. |
| యామినీ కృష్ణమూర్తి నాట్యం బాగా చేసేది. | Yamini Krishnamurti used to dance very well. |
| వాళ్ళ ఆఫీసరు అందరినీ తిట్టేవాడు. | His officer used to scold all persons. |
| అతను తన గొప్ప తానే చెప్పుకొనే వాడు. | He used to boast about himself. |
| ఆవిడ ఎవరినీ, ఎన్నడూ మర్యాదగా పిలిచేది కాదు. | She never used to call anybody politely. |
| ఎక్కడో | 'somewhere' |

| | |
|---|---|
| ఎప్పుడో | 'at an indefinite time, long time back, |
| ఎందుకో | 'for some indefinite or unknown reason or purpose' |
| ఎవరో | 'somebody' |
| ఎంతో | 'of some indefinite quantity or cost' |
| ఏమిటో/ఏమో | 'some indefinite thing' |
| ఎందరో/ఎంతమందో | 'some indefinite number of persons, so many persons' |
| ఎన్నో | 'some indefinite number of things or so many things, |
| రామ్మూర్తి ఎక్కడికో వెళ్ళాడు. | Rammurti went somewhere. |
| వాళ్ళు ఎప్పుడో వచ్చారు. | They came long time back (They came at a time that is not definitely known). |
| ఆవిడ ఎందుకో పిలిచారు. | She called for some thing. |
| అక్కడ ఎవరో కూర్చున్నారు. | Somebody sat there. |
| దాని ఖరీదు ఎంతో తెలియదు. | The price of it is not known. |
| పాప ఏమిటో చెబుతున్నది. | The baby is telling something. |
| అతను చెప్పేది ఏమో విన్నావా ? | Have you heard what he is saying ? |
| ఆయన్ని చూడ్డానికి ఎందరో వచ్చారు. | So many persons came to see him. |
| నేను వాడికి ఎన్నో చెప్పాను. | I told him so many things. |
| ఇస్తాడో, ఇయ్యడో (ఇవ్వడో) | 'whether he (intimate/inferior) gives or not' |
| ఉంటారో, ఉండరో | 'Whether he or she (polite/formal) stays are not' |

| | |
|---|---|
| దొరుకుతాయో, దొరకవో | 'whether (those) things are available or not' |
| వస్తుందో, రాదో | 'whether she (intimate/inferior) or it comes or not' |
| అతను డబ్బు ఇస్తాడో, ఇయ్యడో నాకు తెలుసు. | I know whether he gives money or not. |
| ఆయన ఇంట్లో ఉంటారో, ఉండరో అడుగు ! | Ask, whether he stays home or not! |
| ఈ ఊళ్ళో మామిడి పళ్ళు దొరుకుతాయో, లేదో తెలుసా ? | Do you know whether mango fruits are available or not in this town? |
| తను* సినిమాకు వస్తుందో, రాదో చెప్పలేదు. | She did not say whether she would come to see the movie or not. |
| మీరు వస్తారో,రారో మాకు తెలియదు. | We did not know whether you would come or not. |
| నేను ఇంట్లో ఉంటానో, ఉండనో చెప్పలేను. | I cannot say whether I would stay home or not. |
| పాపా, మీ అమ్మ (ఇవాళ) అన్నం వండుతుందో, వండదో అడుగు. | Baby, ask your mother whether she would cook food (today) or not. |
| చదువుకున్నావో, లేదో | 'whether you are studying or not' |
| చేస్తున్నారో, నిద్రపోతున్నారో | 'whether he/she is taking food or sleeping' |
| నువ్వు సరిగా చదువుతున్నావో, లేదో నాకు తెలియదు. | I do not know whether you are studying well or not. |

---

* *tanu* (he or she) is common to the masculine and feminine genders.

| | |
|---|---|
| ఆయన ఊరికి వెళ్తున్నారో, లేదో అడుగు ! | Ask, whether he is leaving the station or not. |
| అతను వస్తున్నాడో, లేదో చూడు ! | See, whether he is coming or not. |
| పాఠం అర్థమయిందో, లేదో చెప్పండి. | Please tell me whether the lesson is understood or not. |
| వారు భోంచేస్తున్నారో, నిద్ర పోతున్నారో చూస్తాను. | I will see whether he is taking food or sleeping. |
| మాష్టరుగారు నా పేపరు దిద్దారో, లేదో తెలియదు. | I do not know whether the teacher has corrected my paper or not. |
| ఆఫీసరుగారు గదిలో ఉన్నారో, బయటికి వెళ్ళారో చెప్పు! | Tell me whether the officer is in the room or he has gone out. |
| శారద సినిమా చూసిందో, లేదో చెప్పలేదు. | Sarada did not tell me whether she had seen this movie or not. |
| ఆమె నాట్యం చేసిందో, పాట పాడిందో నీకు తెలియదు. | You do not know whether she has danced or sung a song. |
| వాడు వస్తాడో, చస్తాడో ఎవరికి తెలుసు? | Who knows whether he comes or not (dies)? |
| నీకు చెప్పానో, లేదో నాకు గుర్తు లేదు. | I do not remember whether I told you or not? |
| ఆ అమ్మాయి రాధో, లలితో సరిగా చూడలేదు. | I did not see properly whether the girl was Radha or Lalita. |
| అతను ఉంటాడో తెలియదు, ఉండడో తెలియదు. | I do not know whether he stays or not. |
| నువ్వూ, నేనూ | 'you and I' |
| రామారావూ, రంగారావూ | 'Ramarao and Rangarao' |

| | |
|---|---|
| ఢిల్లీ, బొంబాయీ | 'Delhi and Bombay' |
| ఇదీ అదీ | 'this and that' |
| నువ్వూ నేనూ బజారుకు వెళ్ళాలి. | You and I should go to the market. |
| రామారావూ రంగారావూ పెళ్ళికి వచ్చారు. | Ramarao and Rangarao came to attend the marriage. |
| ఢిల్లీ బొంబాయీ చాలా పెద్ద ఊళ్ళు. | Delhi and Bombay are big cities. |
| ఆయన అదీ ఇదీ చెప్పి పంపించారు. | He said this and that and sent (the person) away. |
| వాడూ వీడూ సినిమాకి వెళ్ళారు. | That fellow and this fellow went to see a movie. |
| ఆవిడ నిన్నా మొన్నా మా ఇంటికి వచ్చారు. | She came to my house yesterday and day before yesterday. |
| లక్ష్మీ లలితా పేరంటానికి వెళ్ళారు. | Lakshmi and Lalita went to attend perantam (haldi-kumkum). |
| మా అమ్మాయీ అల్లుడూ కలకత్తాలో ఉన్నారు. | My dauhgter and son-in-law are in Calcutta. |
| నాకు పెసరట్టూ ఉప్మా ఇష్టం. | I like pesarattu and upma. |
| పప్పూ, కూరా, పచ్చడీ, ఊరగాయా, పులుసూ — అన్నీ వడ్డించారు, కంచంలో. | Dal, curry, chutney, pickle and soup - all are served in the eating plate. |
| రెండూ | 'both the things' |
| ఇద్దరూ | 'both the persons' |
| ఆ పుస్తకాలు రెండూ నావి/ఆ రెండు పుస్తకాలూ నావి. | Those two books are mine. |

| | |
|---|---|
| వీళ్ళు ఇద్దరూ మా పిల్లలు/ఈ పిల్లలిద్దరూ మా పిల్లలు/ఈ ఇద్దరు పిల్లలూ మా పిల్లలు. | These two are my children. |
| ఇద్దరు ఇక్కడికి వచ్చారు. | Two persons have come here. |
| ఇద్దరూ ఇక్కడికి వచ్చారు. | Both the persons have come here. |
| నేను నాలుగు అరటిపళ్ళు తిన్నాను. | I ate four bananas. |
| నేను నాలుగు అరటిపళ్ళూ తిన్నాను /నేను అరటిపళ్ళు నాలుగూ తిన్నాను. | I ate all the four bananas. |
| పదిమంది వాణ్ణి మెచ్చుకున్నారు. | Many (ten) persons have praised him. |
| పదిమందీ వాణ్ణి మెచ్చుకున్నారు. | All the (ten) persons have praised him. |
| వంద రూపాయలు అతనికి ఇచ్చాను. | I gave him hundred rupees. |
| వంద రూపాయలూ అతనికి ఇచ్చాను. | I gave him all the hundred rupees (I have). |
| అధికారం చలాయిస్తే ఎవరు ఒప్పుకుంటారు ? | Who agrees, if anybody wields power (unreasonably)? |
| అధికారం చలాయిస్తే ఎవరూ ఒప్పుకోరు. | Nobo dy agrees if anybody weilds power (unreasonably). |
| వాడు ఎందుకు పనికొస్తాడు ? | Of what use is he? |
| వాడు ఎందుకూ పనికిరాడు. | He is fit for nothing. |
| మీరు ఎంతకు అమ్ముతారు? | For what price do you sell? |
| నేను ఎంతకూ అమ్మను. | I won't sell for any price. |

# LESSON 20

| | |
|---|---|
| వచ్చేయు 'come away' | తినేయు 'eat away' |
| వాడు వచ్చేశాడు*. | He has come (away). |
| పని చేసేశాను. | I have finished the work. |
| ఆమె అన్నం తినేసింది. | She has finished her meal. |
| మేము రాసేశాం. | We have already written. |
| ఆ విషయం చెప్పేశాను. | I have told (him) the matter. |
| ఈ సంగతి అడిగేశాను. | I have asked about this matter. |
| పరీక్షాఫలితాలు వచ్చేశాయి. | Examinations results have come (out). |
| అతనికి డబ్బు ఇచ్చేశాను. | I have given him the money. |
| మా అమ్మాయి పెళ్ళి చేసేశాం. | We have performed the marriage of our daughter. |
| పిల్లి పాలు తాగేసింది. | The cat drank the milk. |
| రైలు వచ్చేసింది. | The train has arrived. |
| - (అ)ట | (affix added to a statement in the reported speech to modify the sentence) |

---

* *-ees* denotes emphasis, as *-poo* does elsewhere (*vaaDu veLLipoo-yaaDu* 'He went away').

| | |
|---|---|
| అతను ఇక్కడికి వస్తాడు + అట = అతను ఇక్కడికి వస్తాడట. | They say, he will come here (It seems, he will come here). |
| వాళ్ళు ఇల్లు అమ్ముతారట. | They say, they will sell the house. |
| రాధ రాత్రి భోంచెయ్యదట. | It seems, Radha does not take food tonight. |
| రాజయ్య దుకాణంలో మంచి బియ్యం అమ్ముతారట. | It seems, good rice is sold in Rajayya's shop. |
| ఈవేళ కుళాయిలో నీళ్ళు రావట. | It seems, water will not come from the tap, today. |
| ఆమె వాళ్ళ చెల్లెలు కాదట | It seems, she is not their (his/her) younger sister. |
| ఆ ఆఫీసులో ఖాళీలు లేవట. | It seems, there are no vacancies in that offfice. |
| ఆ అమ్మాయికి పెళ్ళి కాలేదట. | It seems, that girl is not married yet. |
| ఇప్పుడు టైము పది అయిందట. | It seems, it is ten o'clock now. |
| రావు 'you won't come' | పిలవవు 'you won't call' |
| రావా ?* 'won't you come' | పిలవవా ? 'won't you call ?' |
| రాను 'I won't come' | పిలవను 'I won't call' |
| రానా ? 'could I come ?' | పిలవనా 'could I call' |
| ఉండను 'I won't stay' | రాయను 'I won't write' |
| ఉండనా ? 'could I stay ?, | రాయనా ? 'could I write ?' |
| నువ్వు బజారుకు రావు. | You won't come to the market. |
| నువ్వు బజారుకు రావా ? | Won't you come to the market. |

* *raavu+aa = raavaa*? 'Won't you come ?'

| | |
|---|---|
| నువ్వు ఆమెను పిలవవు. | You won't call her. |
| నువ్వు ఆమెను పిలవవా ? | Won't you call her? |
| నేను ఊరికి రాను. | I won't come to the town. |
| నేను ఊరికి రానా ? | Could I come to the town? |
| నేను నసీమ్‌ను పిలవను. | I won't call Naseem. |
| నేను నసీమ్‌ను పిలవనా ? | Could I call Naseem ? |
| నేను సాయంత్రం ఇంట్లో ఉండను. | I won't stay at home in the evening. |
| నేను సాయంత్రం ఇంట్లో ఉండనా ? | Could I stay at home in the evening? |
| ఆయనకు ఉత్తరం రాయను. | I won't write a letter to him. |
| ఆయనకు ఉత్తరం రాయనా ? | Could I write a letter to him ? |
| రామూ, మా ఇంటికి రావా ? | Ramu, won't you come to my house? |
| వస్తా(ను)లే*. | Ofcourse (Don't you worry !) I will come. |
| అతన్ని పిలవమా ? | Could we invite him ? |
| దానికేం ? తప్పకుండా పిలవండి. | What is there ? You certainly invite him. |
| సినిమా చూడవా ? | Won't you see the movie ? |
| చూస్తాను. | I will see. |
| ఈమెకు మీరు పుస్తకం ఇవ్వరా ? | Won't you give the book to her? |
| ఇవ్వను. | I won't give. |
| ఏమండీ ! లోపలికి రానా ? | Hello ! Could I come in ? |

---

* *-lee* (*lɛNDi* in plural) denotes lack of seriousness or importance in the intention.

| | |
|---|---|
| రండి, రండి. | Please come in; please come in. |
| శేఖరం గారికి ఉత్తరం రాయనా ? | Could I write a letter to Mr. Sekharam? |
| మీ ఇష్టం. | As you like. |
| మేము ఇంటికి వెళ్ళమా ? | Could we go home ? |
| మంచిది, వెళ్ళిరండి. | Alright; please get along. |
| నాన్నా, సినిమాకి వెళ్ళవా ? | Daddy ! Could I go to see a movie ? |
| ఈవేళ వద్దు. | Not today, |
| రేడియో పెట్టనా ? | Could I switch on the radio ? |
| పెట్టు. | Do it. |
| రేపు మిమ్మల్ని ఆఫీసులో కలవనాండి ? | Sir (Madam), could I meet you in office tomorrow? |
| రేపొద్దు. అవతలెల్లుండి కలవండి | Not tomorrow. Please meet me the day next to the day-after-tomorrow. |
| బజారుకు వెళ్ళనా, వద్దా ? | Could I go to the market or not ? |
| సరే, వెళ్ళు. తొందరగా మాత్రం రా. | Alright, go! But come (back) quickly. |
| మీకు కూరవెయ్యనా, పులుసు పొయ్యనా? | Could I serve curry or soup to you? |
| పులుసే పొయ్యి. | Serve soup itself. |
| ఆయనకు టెలిగ్రాం ఇవ్వమా? | Could we give him a telegram ? |
| అక్కర్లేదు. ఉత్తరంరాసి పడెయ్యి; చాలు. | Not necessary. Write a letter and drop it (in the post-box); that would be enough. |
| మీరు భోజనానికి లేవరా? | Won't you get up for taking meal? |
| ఇదుగో, లేస్తున్నా ! | Look, I am getting up. |

# LESSON 21

| | |
|---|---|
| నేను వస్తానని అన్నాను* | I said, "I will come." (I said that I would come) |
| అతను కొంటానని అన్నాడు. | He said, "I will buy" (He said that he would buy). |
| ఆమె వెళ్తానని అన్నది. | She said, "I will go." (She said that she would go), |
| వాళ్ళు అమ్ముతామని అన్నారు. | They said, "We will sell." (They said that they would sell). |
| నేను భోంచేశానని చెప్పాను. | I said, "I had my meal." (I said that I had my meal). |
| ఆయన ఊరికి వెళ్తున్నానని అన్నారు. | He said, "I am going to the town." (He said that he would be leaving the station). |
| ఆవిడ పనిలో ఉన్నానని చెప్పారు. | She said, "I am engaged in work." |
| పిల్లలు పుస్తకాలు కావాలని అడిగారు. | Children said, "We want books," (Children asked for books). |
| కుండలో మంచినీళ్ళు లేవని సీత చెప్పింది. | Sita said, "There is no drinking water in the pot" |

---

* This sentence is composed of two clauses: (i) *neenu annaanu* "I said" (main clause); (ii) *vaastaanu* 'I will come' (quoted clause). These two clauses are joined by means of *ani*. Hence, ***vastaanu+ani=vastaanani***. Telugu has no indirect speech as obtained in English.

| | |
|---|---|
| ఈ కారు కొత్తగా కొన్నానని రాబర్ట్ అన్నాడు. | Robert said, "I bought this car recently." |
| పాఠాలన్నీ చదివేశానని మేరీ అన్నది. | Mary said, "I have read all the lessons." |
| ఈరోజు సినిమాకు వెళ్ళొద్దని నాన్నగారు అన్నారు. | Daddy said, "Don't go to see the movie today." |
| మీ పుస్తకం ఇస్తారా అని నీరజ అడిగింది. | Niraja asked, "Could you give me your book once ?" |
| ఈరోజు ఆఫీసుకు పోనని చెప్పారాయన. | He said, "I won't go to the office today." |
| నా చొక్కా ఎక్కడ పెట్టావని అడిగాను. | I asked, "Where did you keep my shirt?" |
| మీ దగ్గర ఎంత డబ్బుందని లక్ష్మి అడిగింది. | Lakshmi asked, "How much money do you have?" |
| యాభై రూపాయలకన్న ఎక్కువ లేదని చెప్పాను. | I said, "I don't have more than fifty rupees". |

| | | |
|---|---|---|
| ఇమ్మని | × | ఇయ్యొద్దని (ఇవ్వొద్దని/ఇవ్వవద్దని) |
| రమ్మని | × | రావద్దని |
| తెమ్మని | × | తేవద్దని |
| చెయ్యమని | × | చెయ్యొద్దని (చెయ్యవద్దని) |
| వెళ్ళమని | × | వెళ్ళొద్దని (వెళ్ళవద్దని) |
| వినమని | × | వినొద్దని (వినవద్దని) |
| వండుకోమని | × | వండుకోవద్దని |
| కొనుక్కోమని | × | కొనుకోవద్దని |
| చూపించమని | × | చూపించవద్దని |

| | |
|---|---|
| అతను పుస్తకం ఇమ్మని అడిగాడు. | He asked (me), "Give we your book" (He asked me to give my book). |
| అతను డబ్బు ఇయ్యొద్దని చెప్పాడు. | He said "Don't give money." |
| ఆయన ఆఫీసుకు రమ్మని అన్నారు. | He said, "Come to the office." |
| మళ్ళీ రావద్దని ఆవిడ చెప్పారు. | She said, "Don't come again." |
| ఆఫీసరుగారు ఫైలు తెమ్మని అన్నారు. | The officer has said, 'Bring the file.' |
| రాళ్ళబియ్యం తేవద్దని మా ఆవిడ చెప్పింది. | My wife said "Don't bring rice mixed with stones." |
| ఆ పని చెయ్యమని* చెప్పాను. | I said, "Do that work." |
| నా పని పాడుచెయ్యొద్దని ఆయన అన్నారు. | He said, "Don't spoil (disturb) my work." |
| బండికి టైమవుతోంది, తొందరగా వెళ్ళమని చెప్పాను. | I said, "The time for the departure of the train is approaching; go quickly." |
| ఈరోజు వెళ్ళొద్దని ఆమె అంది. | She said, "Don t go today." |
| నా పాట వినమని చెప్పాడు. | He said, "Listen to my song." |
| అతని మాట వినొద్దని అన్నాడు. | He said, "Don't hear his advice." |
| అన్నం వండుకోమని చెప్పింది. | She said, "Cook (food) yourself". |
| ఈరోజు కూర వండుకోవద్దని ఆవిడ చెప్పారు. | She said, "Don't prepare curry (yourself) for today." |
| కొత్తబూట్లు కొనుక్కోమని మా అబ్బాయితో అన్నాను. | I told my son, "Buy new shoes for you." |

---

* Elsewhere it is *ceyyam ani (ceyyavani)* "that we do not do",

| | |
|---|---|
| రోడ్డుమీద అమ్మే మిఠాయి కొనుక్కోవద్దని చెప్పాను. | I said, "Don't buy sweet-meats sold on the road." |
| నెక్లెస్ చూపించమని సుమతి అడిగింది. | Sumati asked, "Show me the necklace." |
| ఈ ఉత్తరం ఆయనకు చూపించొద్దని చెప్పాను. | I said, "Don't show this letter to him." |
| నేను వస్తానని చెప్పాను. | I said, "I will come." |
| మేము వస్తామని చెప్పాము | We said, "We will come." |
| నువ్వు వస్తావని చెప్పాను | I said, "you will come." (I said that you would come) |
| మీరు వస్తారని చెప్పాను. | I said, "You will come" (I said that you would come) |
| ఆమె వస్తుందని చెప్పాను. | I said, "She will come." |
| వాడు వస్తాడని చెప్పాను. | I said, "He will come." |
| ఆయన వస్తారని చెప్పాను. | I said, "He will come." |
| వాళ్ళు వస్తారని చెప్పాను. | I said, "They will come." |
| అవి వస్తాయని చెప్పాను. | I said, "They will come." |
| నువ్వు వస్తావని చెప్పారు. | They said, that you would come. |
| మీరు వస్తారని చెప్పారు. | They said, that you would come. |
| ఆమె వస్తానని చెప్పింది. | She said, that she would come. |
| నువ్వు చదివావని చెప్పాను. | I said, "You read it." (I said that you had read it). |
| నువ్వు చదివావని చెప్పాడు. | He said, "You read it." (He said that you had read it) |

| | |
|---|---|
| నువ్వు చదివావని చెప్పింది. | She said, "You read it." (She said that you had read it). |
| నువ్వు చదివావని చెప్పారు. | They said, "You read it." (They said that you had read it). |
| అని | 'so, as, that ..., because of' |
| ఆకలి లేదని నేను అన్నం తినలేదు. | I did not have appetite; so I did not take food. |
| నువ్వు రాలేదని నేను వెళ్ళలేదు. | You did not come; so I did not go. |
| మీరు చెప్పారని చేశాను. | You told me; so I did it. |
| ఒంట్లో బాగాలేదని అతను సెలవు పెట్టాడు. | He applied for leave as he was not doing well. |
| ఆ మాట అంటే బాగుండదని ఊరుకున్నాను. | I kept quiet as it would not look nice to say that. |
| ఆయనకు చేతిలో అధికారం ఉందని గర్వం. | He is proud as he has power in his hand. |
| ఆఫీసుకు టైమయిందని భోంచెయ్యకుండా బయల్దేరాను. | As the time was up to go the office, I started without taking my meal. |
| అమ్మాయి చదువుకోలేదని మా అబ్బాయి వద్దన్నాడు. | My son refused (to marry) the girl as she was not educated. |
| బస్సు రాలేదని అతను ఆటోలో వెళ్ళాడు. | He went by an auto-rickshaw as the bus did not arrive. |
| మంత్రిగారు పోయారని ఆఫీసులకు సెలవు ఇచ్చారు. | Holiday is declared for the offices as the minister has passed away. |
| పని పూర్తికాలేదని రాత్రి ఎనిమిది గంటలదాకా ఆఫీసులోనే ఉండిపోయాను. | I remained in the office till eight o' clock in the night as the work was not finished. |

| | |
|---|---|
| మీరు రమ్మన్నారని వచ్చాడు. | He came (here) as you asked him to come. |
| గదిలో ఉక్క(బోత)గా ఉండదని (ఇక్కడ) ఆరుబయట కూర్చున్నాను. | I sat here in the open air as it was sultry in the room. |
| ఇంట్లో పాలులేవని టీ పెట్టలేదు. | (I) did not prepare tea as there is no milk in the house. |
| మా అమ్మాయీ అల్లుడూ పండక్కి వస్తారని కొత్తబట్టలు కొన్నాం. | We purchased new clothes, as my daughter and son-in-law would come for the festival. |
| డైరక్టరుగారు రేపు ఊళ్ళో ఉండరని తెలిసింది. | I came to know that the Director would not be in the city tomorrow. |
| వాళ్ళమ్మాయిని కాలేజిలో చేరుద్దామని మద్రాసు వెళ్తున్నారు. | He is going to Madras to get his daughter admitted in a college. |
| ఆమె ఊళ్ళో ఉందో, లేదో అడుగుదామని ఫోన్ చేశాను. | I rang up to find out whether she was in the city or not. |
| వాళ్ళను రమ్మందామని అనుకోలేదు. | I did not think of asking them to come (here). |
| అంత న్యాయం జరుగుతుందని తెలుసుకోలేక పోయాను. | I was not able to know that so much injustice would be done (to me). |
| అందరం హాయిగా ఉండాలనే కోరుకుంటాం. | All of us wish to be happpy. |

(19)

# CONVERSATION 1

మల్లేశం : నమస్కారం జోషీగారూ !
malleSam : namaskaaram jooshiigaaruu !

జోషీ : నమస్కారమండీ !
jooshii : namaskaaramaNDii !

మల్లేశం : రండి.
malleSam : raNDi.

జోషీ : ఇది మీ ఇల్లా !
jooshii : idi mii illaa!

మల్లేశం : ఔనండి.
malleeSam : aunaNDi.

జోషీ : చాలా సంతోషం.
jooshii : tsaalaa santoosham.

మల్లేశం : రండి; కూర్చోండి.
malleeSam : raNDi; kuurtsooNDi.

జోషీ : పెద్ద ఇల్లే ! అద్దె ఇల్లా, సొంత ఇల్లా ?
jooshii : pedda illee ! adde illaa, sonta illaa ?

మల్లేశం : సొంత ఇల్లు కాదండి; అద్దె ఇల్లే.
malleeSam : sonta illu kaadaNDi: adde illee.

జోషీ : ఎన్ని గదులు ?
ooshii : enni gadulu ?

మల్లేశం : నాలుగు.
malleeSam : naalugu,

జోషి : బాగుంది. వీళ్ళు మీ పిల్లలే కదూ ?

jooshi : baagundi. viiLLu mii pillalee kaduu ?

మల్లేశం : వీళ్ళు కాదండి, వాళ్ళు మా పిల్లలు.

malleSam : viiLLu kaadaNDi. vaaLLu maa pillalu.

జోషి : అబ్బాయిలెందరు, అమ్మాయిలెందరు ?

jooshii : abbaayilendaru, ammaayilendaru ?

మల్లేశం : ఇద్దరబ్బాయిలు, ఒక అమ్మాయి.

malleeSam : iddarabbaayilu, okammaayi.

జోషి : చాలా బాగుంది. మరి, ఈ పిల్లలు ఎవరండి?

jooshii : tsaalaa baagundi. mari ii pillalu ewaraNDi ?

మల్లేశం : మా అన్నయ్యగారి పిల్లలు. నలుగురబ్బాయిలు, ఇద్దరమ్మాయిలు.

malleeSam : maa annayyagaari pillaalu. nalugurabbaayilu, iddarammaayilu.

జోషి : అలాగా ! పెద్ద కుటుంబమే ! వస్తాను.

jooshii : alaagaa ! pedda kuTumbamee ! vastaanu.

మల్లేశం : మంచిదండి; నమస్కారం !

malleeSam : mancidaNDi; namaskaaram !

# CONVERSATION 2

రాధ : మాస్టరుగారూ, ఆ కలం ఎవరిదండీ?

raadha : maasTarugaaruu, aa kalam evaridaNDii ?

మాస్టరు : ఏది ? పెద్దదా, చిన్నదా ?

maasTaru : eedi ? peddadaa, cinnadaa ?

రాధ : పెద్దదేనండి.

raadha : peddadeenaNDi.

మాస్టరు : పెద్దది నాదే; చిన్నది శకుంతలమ్మగారిది.

maasTaru : peddadi naadee; cinnadI Sakuntalammagaaridi

రాధ : మీది కొత్తదాండీ ?

raadha : miidi kottadaaNDii ?

మాస్టరు : ఔనమ్మా, కొత్తదే.

maasTaru : aunammaa, kottadee.

రాధ : ఖరీదెంతండి ? పదిరూపాయిలా ?

raadha : khariidentaNDi ? padi ruupaayilaa ?

మాస్టరు : పది కాదమ్మా; పాతిక రూపాయిలు.

maasTaru : padi kaadammaa; paatika ruupaayilu.

రాధ : అబ్బో ! పాతిక రూపాయిలే !

raadhaa : abboo ! paatika ruupaayilee !

మాస్టరు : ఔనమ్మా, చాలా ఖరీదు.

maasTaru : aunammaa, tsaalaa khaariidu.

రాధ : మాస్టరుగారూ, మీది వరంగల్లు కదండీ ?

raadha : maasTarugaaruu, miidi varangallu kadaNDii ?

మాస్టరు : ఔను రాధా ! అదే మా సొంత ఊరు.

maasTaru : aunu raadhaa ! adee maa sonta uuru.

# CONVERSATION 3

కృష్ణారావు : ఆయేషా, ఆ పుస్తకం ఎవరిది ?

krishNaaraavu : aayeeshaa, aa pustakam evaridi ?

ఆయేషా : నాదండి.

aayeeshaa : naadaNDi.

కృష్ణారావు : ఏం పుస్తకం ?

krishNaaravu : eem pustakam ?

ఆయేషా : నవల.

aayeeshaa : navala.

కృష్ణారావు : తెలుగుదా, ఇంగ్లీషుదా?

krisanaaraavu : telugudaa, ingliishudaa ?

ఆయేషా : ఉర్దూదండి.

aayeeshaa : urduudaNDi.

కృష్ణారావు : బాగుందా?

krishnaaraavu : baagundaa?

ఆయేషా : చాలా బాగుంది.

aayeeshaa : tsaalaa baagundi.

కృష్ణారావు : ఎవరిది?

krishnaaraavu : evaridi ?

ఆయేషా : ప్రేమ్‌చందుది.

aayeeshaa : preemcandudi.

కృష్ణారావు : అలాగా ! చాలా సంతోషం.

krishnaaraavu : alaagaa ! tsaalaa santoosham.

# CONVERSATION 4

అన్సారీ: మూర్తిగారూ, మీకు సుందరంగారు తెలుసా?

మూర్తి: తెలియదండి.

అన్సారీ: పోనీ, కామేశ్వర్రావుగారు తెలుసా?

మూర్తి: తెలుసు. కళ్ళడాక్టరుగారే కదూ?

అన్సారీ: ఔనండి. వారి తమ్ముడు సుందరంగారు.

మూర్తి: అలాగా! ఆ సంగతి నాకు తెలియదు.

అన్సారీ: సుందరంగారు పెద్ద ఇంజినీరు.

మూర్తి: ఏ ఇంజినీరూ?

అన్సారీ: ఎలక్ట్రికల్ ఇంజినీరు.

మూర్తి: బాగుంది.

అన్సారీ: ఆయనకు మరాఠీ బాగా వచ్చు.

మూర్తి: అలాగా! మీకు కూడా మరాఠీ వచ్చు కదూ?

అన్సారీ: కొంచెం కొంచెం వచ్చండి. మా తమ్ముడికి ఇంకా బాగా వచ్చు. పాటలూ పద్యాలూ కూడా వచ్చు.

మూర్తి: పాటలు వచ్చా! అయితే సంగీతంకూడా తెలుసా?

అన్సారీ: హిందూస్తానీ సంగీతం కొంచెం వచ్చు. కర్నాటక సంగీతంమాత్రం బాగా వచ్చు.

# CONVERSATION 5

నాన్న : పాపా, ఏం కావాలమ్మా?

పాప : నాకు బొమ్మల పుస్తకం కావాలి నాన్నా!

నాన్న : అలాగే. తెలుగు పుస్తకం కావాలా, ఇంగ్లీషు పుస్తకం కావాలా!

పాప : తెలుగు పుస్తకమే కావాలి. ఇంగ్లీషుది వద్దు.

నాన్న : బాబూ, నీకేం కావాలి?

బాబు : విమానం కావాలి నాన్నా!

నాన్న : అబ్బో! విమానమే! పెద్దదా, చిన్నదా?

బాబు : పెద్దది కావాలి.

నాన్న : ఏం? చిన్నది అక్కర్లేదా ?

బాబు : ఉఁహుఁ! పెద్దదే కావాలి.

నాన్న : సరే. ఇంకా ఏం కావాలి?

బాబు : ఇంకా చాలా కావాలి. కారూ, సైకిలూ, రైలూ . . .

నాన్న : అన్నీ నీకే కావాలా ?

బాబు : ఊఁ! నాకే కావాలి !

నాన్న : సరే.

# CONVERSATION 6

నజీర్ : ఏమండీ, ఆఫీసరుగారు ఎక్కడున్నారు ?

మేరీ : వారిక్కడ లేరండి. మీకేం కావాలి ?

నజీర్ : కొంచెం పని ఉందండి.

మేరీ : అలాగా! వారిప్పుడు మీటింగులో ఉన్నారు.

నజీర్ : పోనీ, అన్వర్ హుసేన్‌గారు ఉన్నారా ?

మేరీ : ఆయన కూడా లేరండి. ప్రస్తుతం సెలవులో ఉన్నారు.

నజీర్ : అయితే ఊళ్ళో లేరా ?

మేరీ : ఊళ్ళోనే ఉన్నారండి. కాని ఆస్పత్రిలో ఉన్నారు.

నజీర్ : అయ్యో, పాపం ! చాలా మంచివారాయన. మీ పేరు ఏమిటండీ ?

మేరీ : మేరీ రాబర్ట్స్. కూచోండి.

నజీర్ : నాకొక సహాయం కావాలి మేరీగారూ !

మేరీ : ఏం కావాలి ?

నజీర్ : మీ ఆఫీసులో నా కాయితాలు ఉన్నాయి. వాటి సమాచారం కొంచెం కావాలి.

మేరీ : అలాగా! మీ పేరు ?

నజీర్ : నజీర్ అహ్మద్. మాది వరంగల్లండి.

మేరీ : మీ కాయితాలు ఇక్కడ లేవండి. పక్క గదిలో సుశీల గారున్నారు. అక్కడున్నాయి.

నజీర్ : చాలా థాంక్సండి. సెలవు.

మేరీ : మంచిదండి.

# CONVERSATION 7

## రిక్షావాలా

రాధ : ఏమయ్యా, వస్తావా?

రిక్షావాలా : వస్తానమ్మా. ఎక్కడికి పోవాలి?

రాధ : విద్యానగర్ పోవాలి.

రిక్షా : మంచిది. కూచోండి.

రాధ : ఎంతియ్యాలి?

రిక్షా : రెండు రూపాయ లియ్యండి.

రాధ : రెండు రూపాయలే?

రిక్షా : ఔనమ్మా. చాలా దూరమున్నది గద!

రాధ : ఎంత దూరం?

రిక్షా : కోసెడు లేదా?

రాధ : కోసె డెక్కడుందయ్యా? మైలుకంటె ఎక్కువ లేదు.

రిక్షా : ఉందమ్మా! నా కష్టం చూసి కిరాయి ఇయ్యండి,

రాధ : రూపాయి ఇస్తాను. వస్తావా?

రిక్షా : ఊఁహుఁ! రూపాయికి అర్ధకిలో బియ్యంగూడా రావు.

రాధ : దానికి నేనేమి చెయ్యాలి! పోనీ, మరో మాట చెప్పు.

రిక్షా : ఒక పావలా తగ్గించుకోండి.

రాధ : అంటే, రూపాయి ముప్పావలా కావాలా? ఈ కాస్త దూరానికి?

రిక్షా : ఇది కాస్త దూరం కాదమ్మా! కోసెడు దూరం.

రాధ : ఎంతో కొంత! వస్తావా రావా?

రిక్షా : ఎందుకు రాను?

రాధ : అయితే ఆఖరి మాట చెప్పు.

రిక్షా : రూపాయిన్నర ఇస్తే వస్తా.

రాధ : సరే, కానియ్యి. ఏం చేస్తాం! రోజులు మండిపోతున్నాయి.

రిక్షా : రోజులు ఏం చేస్తాయమ్మా! మనుషులే అట్లా ఉన్నారు.

రాధ : సరే సరే, తొందరగా పోనియ్యి.

రిక్షా : మీరు కూచోండి. రైలుబండిలా పోనిస్తా గద!

# CONVERSATION 8

# దారి ఎటు?

ముత్తుస్వామి : ఏమండీ, ఈ రోడ్డు ఎటు పోతుంది?

సుందరం : సికింద్రాబాదు స్టేషన్‌కు పోతుందండి.

ముత్తు : సికింద్రాబాదు స్టేషను దగ్గిరేనాండీ?

సుంద : చాలా దూరం.

ముత్తు ; ఎంత దూరమండి? పది కిలోమీటర్లుంటుందా?

సుంద : అఁహాఁ! అంత లేదండి. ఐదారు కిలోమీటర్లు ఉంటుంది.

ముత్తు : అలాగా! పట్నాల్లో దూరాలు తెలుసుకోడం కష్టం.

సుంద : ఆ మాట నిజం. కాని ఒక్కసారి ఆటోలో వెళ్ళి చూస్తే ఇట్టే తెలిసిపోతుంది.

ముత్తు : అదెలా?

సుంద : ఆటో వాళ్ళు కిలోమీటరుకు యాభై పైసల చొప్పున తీసుకుంటారు. మీటర్లో కనిపిస్తుంది. మీరు దిగేచోట మీటరులో మూడురూపాయలు కనిపిస్తే, మీరు ఆరు కిలోమీటర్లు వెళ్ళారన్నమాట. మూడు రూపాయలంటే ఆరు అర్ధరూపాయలు. కిలోమీటరుకు అర్ధరూపాయి.

ముత్తు : ఔనౌను. మీరన్నది నిజమేనండి.

సుంద : మీరిప్పుడు స్టేషన్‌కు వెళ్ళాలా?

ముత్తు : లేదండి. హిమాయత్ నగర్ వెళ్ళాలి.

సుంద : అలాగా! అయితే పరవాలేదు. దగ్గిరే.

ముత్తు : నడిచి వెళ్ళొచ్చా?

సుంద : వెళ్ళొచ్చండి.

ముత్తు : ఎటు వెళ్ళాలి?

సుంద : మీరు ఇటు చక్కగా వెళ్ళండి. యాభై గజాల దూరంలో ఒక చౌరస్తా వస్తుంది. దాన్ని వై.ఎం.సి.ఏ. చౌరస్తా అంటారు.

ముత్తు : ఔను. చూశానండి. ఆ చౌరస్తా మధ్యలో ఒకాయన విగ్రహం ఉంది కదండీ?

సుంద : ఔనండి. రాజా బహాదూర్ వెంకట్రామారెడ్డిగారి విగ్రహమది. ఆయన ఒకప్పుడు ఇక్కడ కొత్వాలుగా పనిచేశారు ఆయన చాలా గొప్పవారు.

ముత్తు : నేనూ విన్నాను. ఆయన పేరుమీద ఆడవాళ్ళ కాలేజి ఒకటి ఉందట కదా?

సుంద : ఉందండి. వై.ఎం.సి.ఏ. నుంచి కుడివేపు తిరిగి ముందుకు వెళ్ళాలి.

ముత్తు : అయితే హిమాయత్ నగర్ కు ఎడంవేపు తిరగాలా?

సుంద : ఔను. ఎడంవేపు తిరిగితే ఒక సినిమా హాలు వస్తుంది. దాని పేరు శాంతీటాకీసు. ఇంకా ముందుకు వెళ్ళాలి. అక్కడ మరో చౌరస్తా వస్తుంది.

ముత్తు : ఎంత దూరంలో వస్తుంది?

సుంద : ఎంతో దూరం లేదు. దగ్గిరే అక్కడ న్యూసైన్స్ కాలేజి ఉంది. అక్కడ రోడ్డు చీలుతుంది. అటు ఒకదారి రామ్ కోట్ కు పోతుంది. ఇటు మరొక దారి కింగ్ కోఠీకి పోతుంది. న్యూసైన్స్ కాలేజీకి వెనక వేపు మరో చౌరస్తా ఉంది. అక్కడ కుడిచేతివేపు తిరిగి పడమరగా పోతే పాత ఎం.ఎల్.క్వార్టర్సు వస్తాయి.

ముత్తు : ఆఁ! అక్కడికే వెళ్ళాలండి నేను.

సుంద : క్వార్టర్స్‌కే వెళ్ళాలా, మరో ఇంటికి వెళ్ళాలా?

ముత్తు : ఇంటికి కాదండి. ఒక ఆఫీసుకు వెళ్ళాలి. అది పాత ఎం.ఎల్.ఏ. క్వార్టర్స్ దగ్గిర ఉందిట.

సుంద : ఏ ఆఫీసండి?

ముత్తు : తెలుగు అకాడమీ.

సుంద : తెలుగు అకాడమీయా! అయితే దగ్గిరే.

ముత్తు : ఎలా వెళ్ళాలండి?

సుంద : న్యూ సైన్స్ కాలేజీకి ఇవతల ఒక చౌరస్తా ఉంది కదా! అక్కణ్ణించి కుడివేపు తిరగండి. ఒక సన్న సందు వస్తుంది. ఆ పేటను విఠల్ వాడీ అంటారు. ఆ సందులో పదిపదిహేను గజాలు వెళ్తే, కుడివేపు అమ్మవారి గుడి ఒకటి కనిపిస్తుంది. గుడికి దాదాపు ఎదురుగా, అంటే ఎడంచేతి వేపు, మరో సందు వస్తుంది. అందులోకి మళ్ళండి. అలా తిన్నగా పోతే దిగువన మరో పెద్దరోడ్డు వస్తుంది. రోడ్డుకు అవతల, మీకు ఎదురుగా, ఒక కంపెనీ బోర్డు కూడా కనిపిస్తుంది.

ముత్తు : ఎం.ఎల్.ఏ. క్వార్టర్స్ నుంచి వచ్చే రోడ్డు అదే కదండీ?

సుంద : ఔనండి. దక్షిణం నుంచి ఉత్తరానికి, హిమాయత్ నగర్ పెట్రోల్ బంకు దాకా ఉంది.

ముత్తు : ఆఁ, ఆ రోడ్డుకే వెళ్ళాలండి.

సుంద : మీరు రోడ్డు దాటనక్కర్లేదు. సందు చివర నించుని కుడిపక్కకి చూస్తే పెద్దమేడ ఒకటి కనిపిస్తుంది. దాని గేట్లోకి వెళ్ళండి. తాటికాయ లంత అక్షరాలతో పెద్ద బోర్డు కనిపిస్తుంది. అదే తెలుగు అకాడమీ ఆఫీసు.

ముత్తు : చాలా థాంక్సండి. మీకు చాలా శ్రమ ఇచ్చాను.

సుంద : పరవాలేదండి. మీరు ఈ ఊరికి కొత్తగదా! మీలాంటివారికి సహాయం చెయ్యడం మా విధి.

ముత్తు : చాలా సంతోషమండి. సెలవు!

సుంద : మంచిదండి, నమస్కారం!

# CONVERSATION 9

# రోజులు ఇలా ఉన్నాయి

రామారావు : టైమెంతయింది జాన్?

జాన్ : తొమ్మి దయిందండి.

రామా : ఫలహారం చేశావా?

జాన్ : చేశానండి.

రామా : ఎన్ని గంటలకు?

జాన్ : ఎనిమిదిన్నరకు.

రామా : భోజనం ఎప్పుడు చేస్తావు? పన్నెండు గంటలకా?

జాన్ : కాదండి; ఒంటిగంటకు.

రామా : రాత్రి?

జాన్ : ఆరుంబావుకు.

రామా : మరి, పడుకోడం?

జాన్ : తొమ్మిదిమ్ముప్పావుకు.

రామా : అలాగా! ప్రతిరోజూ ఇలాగే చేస్తావా?

జాన్ : ఔనండి. మా దేశంలో ఇలాగే చేస్తాం.

రామా : ఓహో! ఆ సంగతి నాకు తెలియదు.

మీ ఇంటికి అద్దె ఎంతిస్తున్నావు?

# CONVERSATION 9

# రోజులు ఇలా ఉన్నాయి

రామారావు : టైమెంతయింది జాన్?

జాన్ : తొమ్మి దయిందండి.

రామా : పలహారం చేశావా?

జాన్ : చేశానండి.

రామా : ఎన్నిగంటలకు?

జాన్ : ఎనిమిదిన్నరకు.

రామా : భోజనం ఎప్పుడు చేస్తావు? పన్నెండు గంటలకా?

జాన్ : కాదండి; ఒంటిగంటకు.

రామా : రాత్రి?

జాన్ : ఆరుంబావుకు.

రామా : మరి, పడుకోడం?

జాన్ : తొమ్మిదిమ్ముప్పావుకు.

రామా : అలాగా! ప్రతిరోజూ ఇలాగే చేస్తావా?

జాన్ : ఔనండి. మా దేశంలో ఇలాగే చేస్తాం.

రామా : ఓహో! ఆ సంగతి నాకు తెలియదు.

మీ ఇంటికి అద్దె ఎంతిస్తున్నావు?

సుంద : క్వార్టర్స్‌కే వెళ్ళాలా, మరో ఇంటికి వెళ్ళాలా?

ముత్తు : ఇంటికి కాదండి. ఒక ఆఫీసుకు వెళ్ళాలి. అది పాత ఎం.ఎల్.ఏ. క్వార్టర్స్ దగ్గిర ఉందిట.

సుంద : ఏ ఆఫీసండి?

ముత్తు : తెలుగు అకాడమీ.

సుంద : తెలుగు అకాడమీయా! అయితే దగ్గిరే.

ముత్తు : ఎలా వెళ్ళాలండి?

సుంద : న్యూ సైన్స్ కాలేజికి ఇవతల ఒక చౌరస్తా ఉంది కదా! అక్కణ్ణించి కుడివేపు తిరగండి. ఒక సన్న సందు వస్తుంది. ఆ పేటను విఠల్‌వాడీ అంటారు. ఆ సందులో పదిపదిహేను గజాలు వెళ్తే, కుడివేపు అమ్మవారి గుడి ఒకటి కనిపిస్తుంది. గుడికి దాదాపు ఎదురుగా, అంటే ఎడంచేతి వేపు, మరో సందు వస్తుంది. అందులోకి మళ్ళండి. అలా తిన్నగా పోతే దిగువన మరో పెద్దరోడ్డు వస్తుంది. రోడ్డుకు అవతల, మీకు ఎదురుగా, ఒక కంపెనీ బోర్డు కూడా కనిపిస్తుంది.

ముత్తు : ఎం.ఎల్.ఏ. క్వార్టర్స్ నుంచి వచ్చే రోడ్డు అదే కదండీ?

సుంద : ఔనండి. దక్షిణం నుంచి ఉత్తరానికి, హిమాయత్ నగర్ పెట్రోల్ బంకు దాకా ఉంది.

ముత్తు : ఆఁ, ఆ రోడ్డుకే వెళ్ళాలండి.

సుంద : మీరు రోడ్డు దాటనక్కర్లేదు. సందు చివర నించుని కుడిపక్కకి చూస్తే పెద్దమేడ ఒకటి కనిపిస్తుంది. దాని గేట్లోకి వెళ్ళండి. తాటికాయ లంత అక్షరాలతో పెద్ద బోర్డు కనిపిస్తుంది. అదే తెలుగు అకాడమీ ఆఫీసు.

ముత్తు : చాలా థాంక్సండి. మీకు చాలా శ్రమ ఇచ్చాను.

సుంద : పరవాలేదండి. మీరు ఈ ఊరికి కొత్తగదా! మీలాంటివారికి సహాయం చెయ్యడం మా విధి.

ముత్తు : చాలా సంతోషమండి. సెలవు!

సుంద : మంచిదండి, నమస్కారం!

జాన్ : ఆరువందలండి.

రామా : ఎన్ని గదులు?

జాన్ : మొత్తం నాలుగు. ఒక పడగ్గది, వంటిల్లు, భోజనాల హాలు, డ్రాయింగ్ రూము.

రామా : మీకు రిఫ్రిజరేటర్ ఉందా?

జాన్ : ఉందండి. కిరాయకు తీసుకొన్నాను.

రామా : కిరాయ ఎంతుంటుంది?

జాన్ : నెలకు యాభై రూపాయలండి.

రామా ; చాలా ఎక్కువే! మీరు మొత్తం ఎందరు?

జాన్ : ముగ్గురం. నేను, నా భార్య, మా పాప.

రామా : నాలుగ్గదుల్లో ముగ్గురుంటారా?

జాన్ : ఔనండి. ఏం?

రామా : ఏంలేదు. మా ఇల్లు కూడా నాలుగ్గదులే. కాని ఎనిమిదిమందిమి ఉంటున్నాం.

జాన్ : అయితే చాలా కష్టం.

రామా : ఇది భారతదేశం మిస్టర్! ఆ నాలుగు గదుల్లోనే మాకు రెట్టింపు మంది కూడా ఉంటుంటారు.

జాన్ : నిజమేలెండి. రోజులు ఇలా ఉన్నాయి.

రామా : యాభై కిలోల బియ్యం పదిరోజులు కూడా రావు.

జాన్ : జనాన్ని బట్టి ఖర్చు.

రామా : అందుకే అంటారు – "మంది ఎక్కువయితే మజ్జిగ పలచబడుతుంది" అని.

జాన్ : ఆగండాగండి. ఈ సామెత నన్ను రాసుకోనియ్యండి.

# CONVERSATION 10

## సినిమాకి వెళ్దాం

రామ్‌సింగ్ : గోవిందరావుగారూ, ఏమిటి ఇలా వచ్చారు? దారితప్పి వచ్చారా?

గోవిందరావు : లేదండి; మీకోసమే!

రామ్ : నిజంగా?

గోవింద : ఒట్టు!

రామ్ : పనిమీద వచ్చారా?

గోవింద : అఁహాఁ! ఊరికే వచ్చాను,

రామ్ : అయితే రండి; తాజ్‌లో కాఫీ తాగుదాం.

గోవింద : ఇప్పుడు టైము లేదు.

రామ్ : దేనికంత తొందర?

గోవింద : మనమిప్పుడు సినిమాకి వెళ్తున్నాం.

రామ్ : మనమా?

గోవింద : ఔను, పదండి.

రామ్ : కాఫీ తాగి వెళ్ళొచ్చుగా!

గోవింద : కాఫీకిప్పుడు టైము లేదు! ఇంటర్వెల్‌లో తాగుదాం లెండి.

రామ్ : ఇంతకూ, ఏ సినిమాకు వెళ్దాం?

జాన్ : ఆరువందలండి.

రామా : ఎన్ని గదులు?

జాన్ : మొత్తం నాలుగు. ఒక పడగ్గది, వంటిల్లు, భోజనాల హాలు, డ్రాయింగ్ రూము.

రామా : మీకు రిఫ్రిజరేటర్ ఉందా?

జాన్ : ఉందండి. కిరాయకు తీసుకొన్నాను.

రామా : కిరాయ ఎంతుంటుంది?

జాన్ : నెలకు యాభై రూపాయలండి.

రామా ; చాలా ఎక్కువే! మీరు మొత్తం ఎందరు?

జాన్ : ముగ్గురం. నేను, నా భార్య, మా పాప.

రామా : నాలుగ్గదుల్లో ముగ్గురుంటారా?

జాన్ : ఔనండి. ఏం?

రామా : ఏంలేదు. మా ఇల్లు కూడా నాలుగ్గదులే. కాని ఎనిమిదిమందిమి ఉంటున్నాం.

జాన్ : అయితే చాలా కష్టం.

రామా : ఇది భారతదేశం మిస్టర్! ఆ నాలుగు గదుల్లోనే మాకు రెట్టింపు మంది కూడా ఉంటుంటారు.

జాన్ : నిజమేలెండి. రోజులు ఇలా ఉన్నాయి.

రామా : యాభై కిలోల బియ్యం పదిరోజులు కూడా రావు.

జాన్ : జనాన్ని బట్టి ఖర్చు.

రామా : అందుకే అంటారు – "మంది ఎక్కువయితే మజ్జిగ పలచబడుతుంది" అని.

జాన్ : ఆగండాగండి. ఈ సామెత నన్ను రాసుకోనియ్యండి.

గోవింద : 'కరుణామయుడు'.

రామ్ : కరుణామయుడా? అయితే దగ్గిరే!

గోవింద : మీరు చూసేశారా?

రామ్ : లేదండి.

గోవింద : చాలా బాగుందట.

రామ్ : ఏసుక్రీస్తు కథే కదూ?

గోవింద : అదే; బాగా తీశాట్ట!

రామ్ : బ్లాకండ్ వైటా?

గోవింద : అహాఁ! కలరు.

రామ్ : అయితే పరవాలేదు.

గోవింద : క్రీస్తును శిలువవేసిన దృశ్యం బ్రహ్మాండంగా ఉందిట.

రామ్ : అయితే చూడవలసిందే! నటీనటులెవరు?

గోవింద : అబ్బో, చాలా మందే ఉన్నారు! ముక్కామలా, ధూళిపాళా, జగ్గయ్యా, త్యాగరాజూ, వెన్నిరాడై నిర్మలా, హలం, రాజసులోచనా! అన్నట్టు, రాజబాబు కూడా ఉన్నాడండోయ్!

రామ్ : వీళ్ళు సరే; ప్రధాన నటుడెవరు?

గోవింద : అన్నట్టు, చెప్పడం మరిచిపోయాను!

రామ్ : విజయ చందర్ కదూ?

గోవింద : ఔను. అతనే. ఏసుక్రీస్తు పాత్ర వేశాడు.

రామ్ : నిర్మాతకూడా అతనే కదూ?

గోవింద : ఔను. అతనే. వయస్సుకూడా ఎక్కువ ఉండదు. సుమారు ముప్ఫై ఏళ్ళనుకోండి!

రామ్ : ఇంతే?

గోవింద : నిజం! అతన్ని నేను చిన్నప్పుడు చూశాను. వాళ్ళన్నయ్య నా క్లాస్‌మేటు.

రామ్ : అలాగా! అయితే తొందరగా పదండి. ఆలస్యం చేస్తే ఆశాభంగం!

గోవింద : అదే మరి! నాలుగు రూపాయల టిక్కెట్లు తీసుకుందామా?

రామ్ : ఏది దొరికితే అది!

గోవింద : కింది క్లాసుల కయితే రద్దీ ఉంటుంది.

రామ్ : పెద్దక్లాసులకు ఎడ్వాన్స్‌గా బుక్ అయిపోవచ్చు కదా!

గోవింద : అయినా ప్రయత్నం చేద్దాం.

రామ్‌సింగ్ : టిక్కెట్లు నేను తీసుకుంటాను.

గోవింద : మీరు కాదు; నేను!

రామ్ : అఁహఁ, అలా కాదు; నేనే!

గోవింద : కాదు నేనే!

రామ్ : ఔను నేనే!

గోవింద : మిమ్మల్ని తీసుకువెళ్ళేవాణ్ణి నేను!

రామ్ : మీకు కంపెనీ ఇచ్చేవాణ్ణి నేను.

గోవింద : మనమిలా వాదంలోకి దిగితే బుకింగు బందయి పోతుంది. నా మాట విని, ఈసారికి నన్ను తీసుకోనియ్యండి!

రామ్ : మీరే ఎందుకు తీసుకోవాలి?

గోవింద : ఈరోజు నా పుట్టినరోజు. మీకు సినిమాపార్టీ ఇస్తున్నాను.

రామ్ : సరే అయితే! కానియ్యండి. మరోసారి ఇలా చేస్తే ఊరుకోను. తెలిసిందా?

గోవింద : సరే స్వామీ, ముందు మీరు నడవండి.

గోవింద: నిజం! అతన్ని నేను చిన్నప్పుడు చూశాను. వాళ్ళన్నయ్య నా క్లాస్‌మేటు.

రామ్: అలాగా! అయితే తొందరగా పదండి. ఆలస్యం చేస్తే ఆశాభంగం!

గోవింద: అదే మరి! నాలుగు రూపాయల టిక్కెట్లు తీసుకుందామా?

రామ్: ఏది దొరికితే అది!

గోవింద: కింది క్లాసుల కయితే రద్దీ ఉంటుంది.

రామ్: పెద్దక్లాసులకు ఎడ్వాన్స్‌గా బుక్ అయిపోవచ్చు కదా!

గోవింద: అయినా ప్రయత్నం చేద్దాం.

రామ్‌సింగ్: టిక్కెట్లు నేను తీసుకుంటాను.

గోవింద: మీరు కాదు; నేను!

రామ్: అహాఁ, అలా కాదు; నేనే!

గోవింద: కాదు నేనే!

రామ్: కాను నేనే!

గోవింద: మిమ్మల్ని తీసుకువెళ్ళేవాణ్ణి నేను!

రామ్: మీకు కంపెనీ ఇచ్చేవాణ్ణి నేను.

గోవింద: మనమిలా వాదంలోకి దిగితే బుకింగు బందయిపోతుంది. నా మాట విని, ఈసారికి నన్ను తీసుకోనియ్యండి!

రామ్: మీరే ఎందుకు తీసుకోవాలి?

గోవింద: ఈరోజు నా పుట్టినరోజు. మీకు సినిమాపార్టీ ఇస్తున్నాను.

రామ్: సరే అయితే! కానియ్యండి. మరోసారి ఇలా చేస్తే ఊరుకోను. తెలిసిందా?

గోవింద: సరే స్వామీ, ముందు మీరు నడవండి.

గోవింద : 'కరుణామయుడు'.

రామ్ : కరుణామయుడా? అయితే దగ్గిరే!

గోవింద : మీరు చూసేశారా?

రామ్ : లేదండి.

గోవింద : చాలా బాగుందట.

రామ్ : ఏసుక్రీస్తు కథే కదూ?

గోవింద : అదే; బాగా తీశాట్ట!

రామ్ : బ్లాకండ్ వైటా?

గోవింద : అఁహాఁ! కలరు.

రామ్ : అయితే పరవాలేదు.

గోవింద : క్రీస్తును శిలువవేసిన దృశ్యం బ్రహ్మాండంగా ఉందిట.

రామ్ : అయితే చూడవలసిందే! నటీనటులెవరు?

గోవింద : అబ్బో, చాలా మందే ఉన్నారు! ముక్కామలా, ధూళిపాళా, జగ్గయ్యా, త్యాగరాజూ, వెన్నిరాడై నిర్మలా, హాలం, రాజసులోచనా! అన్నట్టు, రాజబాబు కూడా ఉన్నాడండోయ్!

రామ్ : వీళ్ళు సరే; ప్రధాన నటుడెవరు?

గోవింద : అన్నట్టు, చెప్పడం మరిచిపోయాను!

రామ్ : విజయ చందర్ కదూ?

గోవింద : ఔను. అతనే. ఏసుక్రీస్తు పాత్ర వేశాడు.

రామ్ : నిర్మాతకూడా అతనే కదూ?

గోవింద : ఔను. అతనే. వయస్సుకూడా ఎక్కువ ఉండదు. సుమారు ముప్ఫై ఏళ్ళనుకోండి!

రామ్ : ఇంతే?

# CONVERSATION 11

# ఆఫీసు - ఆదివారం

జగన్నాథం : కన్నప్పగారూ! నేనింక వస్తాను.

కన్నప్ప : అప్పుడే వెళ్తారా?

జగ : మళ్ళీ కలుసుకొందాం. నేను ఆఫీసుకు వెళ్ళాలి.

కన్న : అయ్యో, జగన్నాథంగారూ! మీరు వారాలుకూడా మరిచిపోతున్నారు

జగ : అంటే?

కన్న : ఈవేళ ఆదివారం మహాశయా!

జగ : ఓహో, అదా! నిజమే. నాకు కూడా ఇంట్లోనె ఉండాలని ఉంది. కాని ఆఫీసు పని చాలా ఉంది. ఈరోజు మా ఆఫీసరుగారు కూడా వస్తారు. ఇద్దరం కూర్చుని పని పూర్తిచెయ్యాలి.

కన్న : ఒక్క రోజులోనే అయిపోతుందా?

జగ : కాదు కాని, ప్రయత్నం చెయ్యడం మంచిది కదా!

కన్న : చెయ్యండి, చెయ్యండి!

జగ : మీరుకూడా వస్తారా?

కన్న : మీరు వెళ్ళిరండి. ఆదివారంనాడు ఆఫీసుమొహం చూడటం నాకు విసుగు.

జగ : విసుగయితే పని ఎలా అవుతుంది?

కన్న : అయినప్పుడే అవుతుంది.

జగ : ఆ ధోరణి మంచిదికాదు. మీరు కూడా రండి. ముగ్గురం కలిసి పనిచేసుకుందాం.

జగ : ఇదుగో, జగన్నాథంగారూ! వారానికి ఒకే ఒక ఆదివారం. ఆ ఒక్క రోజే మనకు విశ్రాంతి. పైగా, నాకు అర్జంటు ఫైళ్ళు ఏవీ లేవు.

జగ : సరే మీ ఇష్టం!

కన్న : ఇంకో సంగతి. ఈ రోజు మా ఇంటికి చుట్టాలొస్తున్నారు. వాళ్ళు ఈ ఊరికి కొత్త. వాళ్ళకి నేను ఊరు చూపించాలి.

జగ : అయితే సరే. మళ్ళీ రేపు కలుద్దాం.

కన్న : మంచిదండి; ఉంటాను.

# CONVERSATION 12

# బట్టల దుకాణంలో

కొనేవారు : కొంచెం, చీరలు చూపిస్తారా ?

దుకాణదారు : ఎటువంటి చీరలు కావాలి? పట్టుచీరలా నూలుచీరలా?

కొనే : అన్నీ చూపెంచండి. కొత్త డిజైన్ ఏమైనా ఉందా?

దుకా : ఇది చూడండి; నిన్నే వచ్చింది.

కొనే : అంత బాగాలేదు. వేరే స్టాయిల్ది ఉందా?

దుకా : ఇదిగో, ఇది ఖటావ్ మిల్ది.

కొనే : ఎంతండి?

దుకా : అరవై ఐదు రూపాయలే.

కొనే : అరవై ఐదు రూపాయలే! ఎందుకు ఇంతా? బయట ముప్పై రూపాయలకి అమ్ముతున్నారు.

దుకా : నాణ్యం చూసి చెప్పండి.

కొనే : అదేమో నాకు తెలియదు.

దుకా : ఖటావ్దే ఎప్పుడూ మంచిది. చాలా సంవత్సరాలు మన్నుతుంది.

కొనే : టెరికాట్, టెరీన్ చీరలు ఉన్నాయా?

దుకా : ఈ పక్కన ఉన్నాయి, రండి. ఇవి నూట ఇరవై; ఇవి నూట ముప్పై ఐదు. మీకేవి కావాలి?

కొనే : అన్నీ చూపించండి. డిజైను మంచిదిమ్మంటే తీసుకొంటాను.

దుకా: చూడండి.

కొనే: ఆ ఎర్రది చూపించండి.

దుకా: ఇదుగో, చూడండి. కట్టుకుంటే చాలా మంచిగా ఉంటుంది.

కొనే: దాని కెంత వెల?

దుకా: ఒక వందా ముప్పై.

కొనే: సరే, పేక్ చెయ్యండి.

దుకా: వేరే పట్టు చీరలు చూస్తారా?

కొనే: ఇప్పుడు వద్దు.

దుకా: చూసిపొండి. ఏదైనా మీకు నచ్చితే, మీరు తర్వాత తీసుకొని పోవచ్చు!

కొనే: సరే, చూస్తాను.

దుకా: పైకి మేడమీదికి రండి! సంక్రాంతికి కొత్త స్టాక్ వచ్చింది. కొన్ని చాలా బాగున్నాయి. మీరు చూస్తే ఇప్పుడే తీసుకుపోతారు.

కొనే: ఆ షో కేసులో ఉన్నది బాగుంది. చూపించండి.

దుకా: ఇది కంచిపట్టుచీర. ఐదు వందల డెబ్భై.

కొనే: అబ్బో! అంత వెలకు దీంట్లో ఏమున్నది?

దుకా: మంచి జరీ ఉంది. రెండు పక్కలా ఉంది. తరవాత, ఇది డబుల్ కలర్ కదా; దానికి ఎక్కువ ధర అవుతుంది.

కొనే: మీరిది నా కోసం అట్టే పెడతారా? నేను రేపు మా అత్తగారితో కూడా వచ్చి తీసుకుంటాను.

దుకా: మీరు తప్పకుండా వస్తామంటే అట్టే పెడతాము.

కొనే: వస్తానని చెప్పాను కదా! మా ఇల్లు ఇక్కడ పక్కనే ఉంది.

దుకా: అడ్వాన్సు ఏమైనా ఇస్తారా?

కొనే: లేదండి; మా అత్తగారు వచ్చి చూడాలి.

దుకా: సరే; రేపు వచ్చి చూడండి.

కొనే: ఆ చీరకి బిల్లు ఇస్తారా?

దుకా: ఇదో, తీసుకోండి. థాంక్సండి.

(మల్లికా ఎస్. నందూర్)

# CONVERSATION 13

## క్లినిక్ లో

స్పీచ్ పేథాలజిస్ట్ : రండి, మీకేం కావాలి?

వచ్చినవారు : మా అబ్బాయికి మాట్లాడ్డం రాదండి.

స్పీ. పే. : అలాగా! అతనికి ఎంత వయస్సు?

వ.వా : నాలుగేళ్ళు.

స్పీ. పే. : ఇంతవరకు ఏం చేశారు?

వ.వా : ఏం చెయ్యలేదు.

స్పీ. పే. : మీ ఊరేది?

వ.వా : నిజామాబాదు.

స్పీ. పే. : ఈ ఊరికి ఎప్పుడు వచ్చారు?

వ.వా : పొద్దున బస్సులో వచ్చాము.

స్పీ. పే. : నా అడ్రెస్ మీకు ఎవరిచ్చారు?

వ.వా . పొద్దున ఆస్పత్రికి వెళ్ళాము; అక్కడ ఒక డాక్టరుగారు మీ అడ్రెస్ ఇచ్చారు.

స్పీ. పే. : మీకు ఎంతమంది పిల్లలు?

వ.వా : ఈ అబ్బాయి ఒక్కడేనండి.

స్పీ. పే. : మీరేం పని చేస్తారు?

వ.వా : నేను సివిల్ కంట్రాక్టర్‌ను.

స్పీ.పే. : మీ అబ్బాయి, పిలిస్తే చూస్తాడా?

వ.వా : ఒకసారి చూస్తాడు, ఒకసారి చూడడు.

స్పీ.పే. : పెద్ద శబ్దానికి చూస్తాడా?

వ.వా : చూస్తాడు.

స్పీ.పే. : ఏమేం మాట్లాడతాడు?

వ.వా : అమ్మా, పాపా, అంటాడు.

స్పీ.పే. : వేరే ఏం లేదా?

వ.వా : లేదండి. అప్పుడప్పుడు తనకి తానే ఏమైనా చెప్తాడు.

స్పీ.పే. : ఇప్పుడు చాలా లేటయింది. మీరు పొద్దున వస్తే నేను టెస్టుచేసి చెప్తాను.

వ.వా : సరే, నమస్కారమండి.

* * * * *

(మర్నాడు పొద్దున)

స్పీ.పే. : రా బాబూ, కూచో.

(అబ్బాయి తండ్రితో) మీరూ కూర్చోండి. ఇప్పుడు చూడు; నేను (అబ్బాయితో) ఇక్కడ చప్పుడు చేస్తాను. అప్పుడు నువ్వు ఈ గిన్నెలో ఒక గోళీ వెయ్యాలి. ఈ గోళీ చేత్తో పట్టుకో. నేను చప్పుడు చేసిన తర్వాత వెయ్యాలి; ముందు వెయ్యకూడదు. తెలిసిందా? ఇక్కడ చూడు.

చప్పుడు చేశాను కదా! ఇప్పుడు గోళీ వెయ్యి. చూడు, నేను వేస్తాను. అలాగే నువ్వుకూడా వెయ్యాలి. ముందు వెయ్యకూడదు; తర్వాత వెయ్యాలి. నువ్వు మంచి అబ్బాయివి కదూ! అలాగే ఇంకోసారి వెయ్యి.

(మల్లికా ఎన్. నందూర్)

## NARRATIVE 1

# ఉగాది పండగ

తెలుగు సంవత్సరంలో మొట్టమొదటి రోజును 'ఉగాది' అంటారు. దీన్నే కొందరు 'సంవత్సరాది' అంటారు. ఆ రోజున తెలుగువాళ్ళంతా పండగ చేసుకొంటారు. తెలుగువాళ్ళేకాదు - కర్నాటకులు, మహారాష్ట్రులు మొదలైన వాళ్ళు చాలామంది ఆ రోజున పండగ చేసుకొంటారు. వీరు అనుసరించేది 'చాంద్రమాన' పంచాంగం. తమిళులు 'సౌరమాన' పంచాగాన్ని అనుసరిస్తారు. అందువల్ల తెలుగు సంవత్సరాదికీ, తమిళ సంవత్సరాదికీ కొన్ని రోజుల తేడా ఉంటుంది.

ఉగాదినాడు తెల్లారగట్ల లేచి తలంటి పోసుకొంటారు. కొత్తబట్టలు కట్టుకొంటారు. "ఉగాది పచ్చడి" తింటారు.

ఉగాది పచ్చడి అంటే ఏమిటి? పచ్చిమామిడికాయ, చెరుకుముక్క, అరటిపండు, బెల్లం తెస్తారు. చిన్నచిన్న ముక్కలుగా చేసి రోట్లో వేస్తారు. చింతపండు, వేపపువ్వు అందులో వేస్తారు. అన్నీ కలిపి రోకలిబండతో తొక్కుతారు. అప్పుడు మెత్తగా పచ్చడి తయారవుతుంది. ఆ పచ్చడి, ఇంట్లో ప్రతి ఒక్కరూ కొద్దికొద్దిగా తింటారు. దాని రుచి చిత్రంగా ఉంటుంది. తీపి, పులుపు, చేదు కలగలుపుగా ఉంటాయి.

ఆనాడు ఇంట్లో పిండివంటలు చేసుకొంటారు - బూరెలు, గారెలు, ఆవడలు, పులిహోర, బొబ్బట్లు, పరమాన్నం వగైరా. అమ్మవారికి నైవేద్యం పెడతారు. చుట్టాలతో, స్నేహితులతో కలిసి భోజనం చేస్తారు.

అత్తవారింట్లో ఉన్న అమ్మాయిలను, అల్లుళ్ళను పండగకు పిలిచి కొత్త బట్టలు పెడతారు; కానుకలు ఇస్తారు. ఆ పూట అంతా వినోదాలతో గడుపుతారు. సాయంత్రం "పంచాంగశ్రవణం" చేస్తారు. మామూలుగా ఇది, దేవాలయంలో జరుగుతుంది. ఒక సిద్ధాంతిగారు పంచాంగం చదువుతూ, సంవత్సర

ఫలాలు, రాశిఫలాలు, గ్రహణాలు మొదలైనవి చెబుతారు. ఆ సంవత్సరం దేశంలో ఉండే పరిస్థితులు వివరిస్తారు. ఏ రాశివాళ్ళకు ఏ ఫలితాలు వస్తాయో చెబుతారు. ఏ పంటలు ఎలా పండుతాయో చెబుతారు; వర్షాలు ఎలా పడతాయో కూడా చెబుతారు. ఈ ఫలితాలు వింటూ ఉంటే కొంత ఆశ కలుగుతుంది; కొంత నిరాశ కలుగుతుంది. ఆశానిరాశల కలయికే కదా జీవితం! తీపి, చేదు, పులుపు కలిస్తేనే ఉగాది పచ్చడి. ఈ సంగతి మనకు ప్రతి ఉగాది పండగనాడూ గుర్తుకు వస్తుంది.

ప్రతి ఉగాదీ మనకు కొత్త ఆశలు కలిగిస్తుంది. అందువల్ల మన కందరికీ ఉగాది అంటే అంత ఇష్టం.

# NARRATIVE 2

# హైదరాబాదు

మా ఊరు హైదరాబాదు. ఇది మా రాష్ట్రానికి రాజధాని. మా రాష్ట్రం పేరు ఆంధ్రప్రదేశం.

హైదరాబాదు పెద్ద నగరం. హైదరాబాదు, సికింద్రాబాదు పక్కపక్కనే ఉంటాయి. అందువల్ల, వీటిని జంటనగరాలు అంటారు. ఈ రెండిటికీ మధ్య హుసేన్‌సాగర్ అనే చెరువు ఉంది.

హైదరాబాదు పేరు చెప్తే "చార్‌మినార్" గుర్తుకు వస్తుంది. చార్‌మినార్ అంటే నాలుగు స్తంభాల కట్టడం. సుమారు ఐదువందల ఏండ్లకుపూర్వం దీన్ని కట్టారు. చార్‌మినార్‌కు దగ్గరిలోనే మక్కామసీదు ఉంది. దీంట్లో కొన్ని వేలమంది కలిసి ప్రార్థన చేసుకోవచ్చు.

హైదరాబాదులో చూడవలసినవి చాలా ఉన్నాయి. వాటిలో సాలార్‌జంగ్ మ్యూజియం ఒకటి. ఇది మూసీనది ఒడ్డున ఉంది. ఇందులో విలువైన వస్తువులు, వింతవింత వస్తువులు చాలా ఉన్నాయి. సాలార్‌జంగ్ అనే ఆయన వీటిని సేకరించాడు. వాటి కోసం డబ్బు చాలా ఖర్చుపెట్టాడు. అందువల్ల ఈ మ్యూజియంకు సాలార్‌జంగ్ మ్యూజియం అని పేరు వచ్చింది. దీన్ని చూడ్డానికి కనీసం ఐదారు గంటలు పడుతుంది. టిక్కెట్టు కొనుక్కుని లోపలికి వెళ్ళాలి.

సాలార్‌జంగ్ మ్యూజియం తరవాత చెప్పుకోవలసింది "నెహ్రూ జూలాజికల్ పార్కు". ఇందులో చాలా జంతువులు, పక్షులు, పాములు, చేపలు-రకరకాలవి ఉన్నాయి. ఈ పార్కులో విశేషం ఏమిటంటే, పులులనూ, సింహాలనూ కూడా బోనులో పెట్టకుండా స్వేచ్ఛగా తిరగనిస్తారు. కాని వాటివల్ల మనకు ప్రమాదం ఉండదు. మన జాగ్రత్తకు కావలసిన ఏర్పాట్లు మనకు ఉంటాయి. ఇందులో చింపాంజీలు, గొరిల్లాలు, పులులు, ఒంటెలు, ఏనుగులు, లేళ్ళు, ఖడ్గమృగాలు,

జీబ్రాలు, కోతులు వంటి జంతువులు చాలా ఉన్నాయి. రకరకాల చిలకలు, కోయిలలు, కోళ్ళు, బాతులు, కొంగలు వంటి పక్షులు ఉన్నాయి. కొండచిలువలు, తాచుపాములు కూడా ఉన్నాయి. ఒకరోజున విహారయాత్ర (ఎక్స్‌కర్షన్)కు వెళ్తే ఇవన్నీ చక్కగా చూడవచ్చు.

హైదరాబాదుకు ఐదారు మైళ్ళదూరంలో గోల్కొండ కోట ఉంది. ఒక కొండకు కిందినుంచి పైవరకు రాతితో కట్టిన పెద్దకోట ఇది. ఒకప్పుడు చాలా ప్రసిద్ధమైన కోట ఇది. గోల్కొండ సామ్రాజ్యానికి ఇదే రాజధాని. కుతుబ్‌షాహీ రాజులకాలంలో ఇది చాలా అభివృద్ధి చెందింది. ఇప్పుడిది చాలా శిథిలమయింది. కాని పాత కట్టడాలు కొన్ని ఇప్పటికీ కనిపిస్తాయి. కొండకింద ఒకచోట నించుని చప్పట్లు చరిస్తే కొండపైన వినిపిస్తాయి. రామదాసు బందిఖానా ఈ కోటలోనే ఉంది. ఈ కోటకు దగ్గరిలో కుతుబ్‌షాహీ నవాబుల గోరీలు ఉన్నాయి.

హైదరాబాదులో ఉస్మానియా విశ్వవిద్యాలయం భవనం చాలా బాగుంటుంది. ఇది గొప్ప రాతి కట్టడం. దానికి కుడి పక్కన, ఒక గుట్టమీద గ్రంథాలయ భవనం ఉంది. ఇది కూడా పెద్దదే. దానికి ఎదురుగా 'లాండ్‌స్కేప్ గార్డెన్‌లు' ఉన్నాయి. వాటివెనక 'టాగూరు ఆడిటోరియం' ఉంది.

ఉస్మానియా ప్రభుత్వ ఆస్పత్రి, ఆంధ్రప్రదేశ్ హైకోర్టు భవనాలు మూసీనదికి చెరొక పక్కన ఉన్నాయి. ఆంధ్రప్రదేశ్ శాసనసభాభవనాలు, రవీంద్ర భారతి, సెక్రటేరియట్ దగ్గరదగ్గరే ఉన్నాయి. వాటికి మధ్యలో ఒక కొండ మీద వెంకటేశ్వరస్వామి గుడి ఉంది. పూర్తిగా పాలరాతితో కట్టిన గుడి ఇది.

హుసేన్ సాగర్ చెరువు పక్కన 'టాంక్ బండ్' మీద పోతే సికింద్రాబాదు వస్తుంది. బేగంపేట విమానాశ్రయం సికింద్రాబాదులోనే ఉంది. సికింద్రాబాదు రైల్వే స్టేషనుకూడా పెద్దదే. చాలా రైళ్ళకు ఇది కూడలి. సౌత్ సెంట్రల్ రైల్వే ప్రధాన కార్యాలయం ఇక్కడే ఉంది.

హైదరాబాదులో నాలుగు విశ్వవిద్యాలయాలున్నాయి—ఉస్మానియా విశ్వవిద్యాలయం, వ్యవసాయ విశ్వవిద్యాలయం, జవాహర్‌లాల్ నెహ్రూ సాంకేతిక విశ్వవిద్యాలయం, యూనివర్సిటీ ఆఫ్ హైదరాబాద్. ఆంధ్రప్రదేశ

సాహిత్య అకాడమి, సంగీత నాటక అకాడమి, లలితకళా అకాడమి ఒకే భవనంలో ఉన్నాయి. కాని తెలుగు అకాడమి హిమాయత్ నగర్ లో ఉంది.

మీరు హైదరాబాదు వస్తే ఇవన్నీ తప్పకుండా చూడాలి.

ఇక్కడ చాలామంది తెలుగు మాట్లాడతారు. ఉర్దూ, కన్నడం, మరాఠీ మాట్లాడేవాళ్ళు కూడా ఉన్నారు. కాని వాళ్ళలో చాలామందికి తెలుగు అర్థమవుతుంది.

# పల్లెటూళ్ళు

మనదేశంలో చాలామంది పల్లెటూళ్ళలోనే ఉంటారు. ఆంధ్రప్రదేశం లో చాలామందికి బతుకు తెరువు వ్యవసాయం. అందువల్ల వాళ్ళు పల్లెల్లో ఉండడం సహజం.

పల్లెటూరు అనగానే పచ్చటి పంటపొలాలు గుర్తొస్తాయి. చల్లటి పైరుగాలి వీస్తూ ఉంటుంది. కొబ్బరిచెట్లు, వేపచెట్లు, రావిచెట్లు, అరిటిచెట్లు గాలికి అల్లల్లాడుతూ ఉంటాయి. దగ్గిర దగ్గిరగా కొన్ని గుడిసెలు కనిపిస్తాయి. ఆ గుడిసెల్లోంచి పొగ బయటికి వస్తూ ఉంటుంది. అవి చూస్తే, అక్కడొక పల్లె ఉందని మనకు తెలుస్తుంది.

ఆ పల్లెకు మిట్టపల్లాల బండిబాట ఒకటి కనిపిస్తుంది. కనీసం సన్నటి కాలిదారి అయినా ఉంటుంది. ఆ దారిలో ముందుకు సాగితే గుడిసెలు దగ్గిరవుతాయి. మనుషులు తిరుగుతుంటారు. పశువులు కనిపిస్తుంటాయి.

ఒక చెరువు కనిపిస్తుంది; లేదా ఒక బావి కనిపిస్తుంది. నీళ్ళకోసం జనం వస్తూపోతూ ఉంటారు. చెరువు గట్టుమీద పెద్ద రావిచెట్టో, వేపచెట్టో ఉంటుంది. దాని చుట్టూ రచ్చబండ ఉంటుంది. కొందరు దానిమీద తీరికగా కూర్చుని కబుర్లు చెప్పుకుంటూ ఉంటారు. దారినిపోయేవాళ్ళను పిలిచి మాట్లాడతారు. 'రామన్నా, రంగయ్యమామా, వెంకమ్మత్తా, సీతక్కా' అంటూ వరసలు పెట్టి పిలుచుకుంటారు.

ఊరిచుట్టూ గుడిసెలు, మధ్యలో పెంకుటిళ్ళూ, మిద్దె ఇళ్ళూ ఉంటాయి. ఒకటీ, అరా మేడలు కూడా ఉంటాయి. ప్రతి ఇంటిముందూ పేడ నీళ్ళు చల్లి ముగ్గులు వేస్తారు. ఇంటింటికీ మామిడాకుల తోరణాలు వేలాడుతూ ఉంటాయి.

అప్పుడప్పుడు దూడల అరుపులు వినిపిస్తాయి. సమ్మెట చప్పుళ్ళు వినిపిస్తాయి. మగ్గం చప్పుడు వినిపిస్తుంది. అంటే, పల్లెలో వ్యవసాయం చేసేవాళ్ళు మాత్రమేకాదు; వేరే పనులు చేసేవాళ్ళు కూడా ఉంటారన్నమాట. పొలం పనులు చేసే కూలీలు ఉంటారు. కమ్మరంపని చేసేవాళ్ళు ఉంటారు. కుమ్మరం పనివాళ్ళు ఉంటారు. వడ్రంగులు ఉంటారు. నేతపనివాళ్ళు ఉంటారు. ఇంకా ఇతర పనులవాళ్ళు కూడా ఉంటారు. వీళ్ళందరూ ఉంటేనే అందరి అవసరాలూ తీరతాయి. ఒకరు లేకపోతే మరొకరి పని జరగదు.

ప్రతి పల్లెలో కనీసం ఒక్క గుడి అయినా కనిపిస్తుంది. అది రామాలయం కావచ్చు, శివాలయం కావచ్చు. అమ్మవారి గుడి లేని ఊరు ఎక్కడయినా ఉందా? గుడి పెద్దదయితే ఒక ధ్వజస్తంభం ఉంటుంది; ఒక గోపురం ఉంటుంది. ఊరు పెద్దదయితే ఒక మసీదు, ఒక చర్చికూడా ఉండొచ్చు.

ప్రతి పల్లే ఒక కుటుంబం. ప్రతి వ్యక్తీ ఇంకొకరికి బంధువు అందుచేతనే పల్లెల్లో వరసలు పెట్టి పిలుచుకొంటారు. కులం, మతం దీనికి అడ్డు రావు. ఒకరి కష్టసుఖాల్ని మరొకరు పంచుకొంటారు. తాము కడుపునిండా తింటారు; పదిమందికి పెడతారు. మంచి మనసుతో, మంచి మాటలతో కలిసిమెలిసి బతుకుతారు. "నోరు మంచి దయితే ఊరు మంచిదవుతుంది" అంటారు కదా!

**NARRATIVE 4**

# బతకమ్మ పండగ

పండగలంటే మనకు ఇష్టం. ఎందువల్ల? మన ఇండ్లకు అందం వస్తుంది. మన మనస్సులకు సంతోషం కలుగుతుంది. చుట్టాలూ, స్నేహితులూ మన ఇండ్లకు వస్తారు. వాళ్ళతో కలిసి విందుభోజనాలు చేస్తాం. కొత్తబట్టలు వేసుకుంటాం. హాయిగా గడుపుతాం. కనీసం కొన్నిరోజులు మన కష్టాలూ, నష్టాలూ మరిచిపోతాం. అందుచేత పండగలంటే మనకందరికీ ఇష్టం.

పండగరోజున విందుభోజనాలు చెయ్యడం, కొత్తబట్టలు వేసుకోడం మాత్రమే కాదు; తలంటిస్నానంచేసి ఇంట్లో పూజచేసుకుంటాం. దైవ ప్రార్థన చేస్తాం. లేకపోతే గుడికి వెళ్ళి దైవదర్శనం చేసుకుంటాం. దానాలు చేస్తాం. పర్వదినాల్లో ఈ ప్రకారంగా చెయ్యడం మనదేశంలో ఆచారం.

మనకు ముఖ్యమైన పండగల్లో దసరాపండగ ఒకటి. మైసూరులోనూ కలకత్తాలోనూ దసరా ఉత్సవాలు అద్భుతంగా చేస్తారట. తెలుగు దేశంలోకూడా దసరా బాగా జరుగుతుంది. ఆశ్వయుజ మాసంలో శుద్ధ పాడ్యమి నాటినుంచి దశమినాటివరకు పదిరోజులపాటు ఈ ఉత్సవాలు జరుగుతాయి. మొదటి తొమ్మిది రోజులూ 'దేవీ నవరాత్రులు' అంటారు. పదో రోజు విజయదశమి.

ఈ పది రోజులూ కొందరు అమ్మవారికి పూజలు చేస్తారు. కొందరు 'బతకమ్మ పండగ' చేస్తారు. దీన్నే 'గౌరమ్మ పండగ' అని కూడా అంటారు. కన్నెపిల్లలకూ ముత్తయిదువలకూ ఈ పండగ చాలా ముఖ్యం.

ఒక కొబ్బరి కుడక (పెంకులేని ఎండు కొబ్బరి చిప్ప) లో పసుపు ముద్ద పెట్టి దానికి బొట్టు పెడతారు. అదే బతకమ్మ అన్నమాట. దాన్ని ఒక పళ్ళెంలో పెట్టి చుట్టూ పువ్వులు పేరుస్తారు — రకరకాల పువ్వులు, రంగురంగుల పువ్వులు! సాయంత్రవేళ, ఆడవాళ్ళు అందరూ కలిసి, గౌరమ్మను ఆరుబయట

పెట్టి, పాట పాడుతూ, చప్పట్లు చరుస్తూ చుట్టూ తిరుగుతారు. ఇలా తొమ్మిది రోజులు చేసి, పదోనాడు బతకమ్మను చెరువుకుగాని బావికిగాని తీసుకువెళ్ళి నీళ్ళలో కలుపుతారు.

'బతకమ్మ' అంటే 'బతుకు ఇచ్చే అమ్మ'-అంటే గౌరీదేవి. తెలంగాణాలో ఈ పేరుతో పండగ చేస్తారు.

# NARRATIVE 5

# ఆంధ్రప్రదేశ్

తెలుగువాళ్ళ రాష్ట్రం ఆంధ్రప్రదేశం. ఇది చాలా విశాలమైనది. ఇందులో ఇరవై మూడు జిల్లాలు ఉన్నాయి :

హైదరాబాదు జిల్లా
రంగారెడ్డి జిల్లా
నిజామాబాద్ జిల్లా
వరంగల్లు జిల్లా
నల్లగొండ జిల్లా
ఆదిలాబాద్ జిల్లా
మహబూబ్‌నగర్ జిల్లా
ఖమ్మం జిల్లా
మెదక్ జిల్లా
కరీంనగర్ జిల్లా
కర్నూలు జిల్లా
కడప జిల్లా
అనంతపురం జిల్లా
చిత్తూరు జిల్లా
నెల్లూరు జిల్లా
ప్రకాశం జిల్లా
గుంటూరు జిల్లా
కృష్ణా జిల్లా
పశ్చిమ గోదావరి జిల్లా
తూర్పు గోదావరి జిల్లా
విశాఖపట్నం జిల్లా
విజయనగరం జిల్లా
శ్రీకాకుళం జిల్లా

రాష్ట్రం మొత్తానికి హైదరాబాదు రాజధాని. ఒక్కొక్క జిల్లాకు ఒక్కొక్క ముఖ్యపట్నం ఉంది. జిల్లా పేరులోనే ముఖ్యపట్నం పేరుకూడా తెలుస్తుంది. కాని కొన్ని జిల్లాలకు అలా తెలియదు. రంగారెడ్డి జిల్లాకు ప్రస్తుతం హైదరాబాదే ముఖ్యపట్నం ప్రకాశం జిల్లాకు ఒంగోలు, కృష్ణాజిల్లాకు మచిలీ

పట్నం, తూర్పుగోదావరి జిల్లాకు కాకినాడ, పశ్చిమగోదావరి జిల్లాకు ఏలూరు ముఖ్యపట్నాలు.

ఈ రాష్ట్రంలో చెప్పుకోవలసిన పెద్ద నదులు రెండు-గోదావరి, కృష్ణ. తుంగభద్ర వీటికంటె చిన్నది. ఈ నదుల నీరు కొన్ని లక్షల ఎకరాలకు అందుతున్నది. కృష్ణానదికి నందికొండ దగ్గర ఒక ఆనకట్ట కట్టారు. దీన్నే నాగార్జున సాగర్ ఆనకట్ట అంటారు. శ్రీశైలం దగ్గర మరో ఆనకట్ట కడుతున్నారు. బెజవాడ దగ్గర బ్యారేజి ఎప్పుడో కట్టేశారు. గోదావరి నదికి పోచంపాడులో ఒక ఆనకట్ట కడుతున్నారు. ధవళేశ్వరంలో బ్యారేజి నిర్మాణం జరుగుతోంది. తుంగభద్రానదికికూడా ఒక ఆనకట్ట కట్టారు. వీటివల్ల ఆంధ్రప్రదేశంలో పంటలు బాగా పండుతున్నాయి. ఈ రాష్ట్రం, "భారతదేశానికి ధాన్యాగారం" (Granary of India) అయింది.

వరి, జొన్న, పొగాకు, పసుపు, వేరుసెనగ, చెరుకు, పత్తి ఈ రాష్ట్రంలో ముఖ్యమైన పంటలు. వీటిలో కొన్ని ఇతర రాష్ట్రాలకు కూడా ఎగుమతి అవుతున్నాయి. కాని, ఇక్కడ మాగాణి భూముల కన్న మెట్టభూములు ఎక్కువ. అందువల్ల సరయిన సమయంలో వానలు పడకపోతే పంటలు సరిగా పండవు.

ఈ రాష్ట్రానికి వరసగా కొన్ని వందల మైళ్ళదూరం, సముద్రతీరం ఉంది. బెస్తవాళ్ళు పడవలమీద సముద్రంలోకి వెళ్ళి చేపలు పడతారు. వాటిని ఇతర రాష్ట్రాలకు కూడా పంపి వ్యాపారం చేస్తారు.

విశాఖపట్నంలో సహజమైన ఓడరేవు ఉంది. ఇక్కడ ఎగుమతి దిగుమతులు చాలా జరుగుతాయి. ముఖ్యంగా, ఇనపఖనిజం ఇక్కణ్ణించే జపాన్‌కు ఎగుమతి అవుతుంది. ఇక్కడ హిందూస్థాన్ షిప్ యార్డు, భారత్ హెవీ ప్లేట్స్ అండ్ వెసల్స్, చమురుశుద్ధి కర్మాగారం మొదలైనవి ఉన్నాయి. త్వరలో ఒక ఉక్కు ఫ్యాక్టరీకూడా నిర్మిస్తారు.

హైదరాబాదు నగరంలో పరిశ్రమలు చాలా ఉన్నాయి: భారత్ హెవీ ఎలక్ట్రికల్స్, సింథెటిక్ డ్రగ్స్, హెచ్.ఎం.టి., ఇ.సి.ఐ.ఎల్., హెచ్.ఎ.ఎల్., న్యూక్లియర్ ఫ్యూయల్ కాంప్లెక్స్, ఐడియల్ కెమికల్స్ మొదలైనవి. రామగుండంలో ఒక ఎరువుల ఫ్యాక్టరీ, ఎలక్ట్రికల్ థర్మల్ స్టేషన్ ఉన్నాయి. బెల్లం

పల్లిలోను, సింగరేణిలోను బొగ్గుగనులు ఉన్నాయి. నిజామాబాద్ జిల్లాలోను, తూర్పు-పశ్చిమ గోదావరి జిల్లాల్లోను పంచదార మిల్లులు, కృష్ణా - గుంటూరు జిల్లాల్లో సిమెంటు ఫ్యాక్టరీలు, గుంటూరు జిల్లాలో పొగాకు కంపెనీలు ఉన్నాయి వీటివల్ల కొన్ని లక్షల మందికి ఉద్యోగాలు దొరికాయి.

ఆంధ్రప్రదేశం ప్రధానంగా వ్యవసాయరాష్ట్రం. ఇప్పుడిప్పుడు పరిశ్రమలు కూడా పెరుగుతున్నాయి. కాని నిరుద్యోగులు ఇంకా చాలామంది ఉన్నారు. రాష్ట్రంలో కొన్ని ప్రాంతాలు ఆర్థికంగా చాలా వెనకబడి ఉన్నాయి. అన్ని ప్రాంతాలూ అభివృద్ధి చెందితే రాష్ట్రం అభివృద్ధి చెందుతుంది. రాష్ట్రం అభివృద్ధి అంటే ప్రజల అభివృద్ధి అన్నమాట.

* * * * *